# రాజ్యాకాంక్ష

చారిత్రక ప్రకరణము

( ౫ అంకములు )



గ్రంథకర్త :

శ్రీ అంకరాజు శంకరరావు



ప్రకాశకులు:

డాక్టరు గురుమూర్తి ఆశయ నిర్వాహక సంఘం

రాజమహేంద్రవరం

★ అంకితము ★

సహృదయులు, దీనబాంధవులు, పూజనీయులు

నా ఆప్తులు అయిన

డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారికి

హృ ద య పూ ర్వ క ము గా

# పరిచయము

శ్రీయుత అంకరాజు శంకరరావు నా కు బాల్యమిత్రుండు.
చిన్నప్పటి నుండియు నాటకపాత్ర ధారణాసక్తుడగు
నాటకస్వరూపమును రంగస్థలానుభవమును చేజిక్కించికొని, క
ధనము ననుభవింపక గుప్తపరచి వృథచేయు లుబ్ధుట్లుగాక "
కాంక్ష" మూలమున రసపిపాసుల యాకాంక్ష దీర్ప సరసుల ప్రె
సమర్పించినాడు.

దీనిని, టాడ్ విరచితమైన రాజస్థాన కథావళినుండి యతి సం
క్షిప్తమగు నితివృత్తము నాధారముగ గైకొని, బుద్ధికుశలతచే నెన్ని
వన్నెచిన్నెలు కల్పించి ("Story is the Thing") కథయే ప్రధాన
యమను షేక్స్పియరు మహాకవి వాక్కు ననుసరించి యతి రసవ
ముగ జేయగల్గినాడు.

సహకారోద్యమ మూలమున సంఘసేవ చేయుచున్నను,
యున్నయగు శ్రీ రామారావు యొక్క యశశ్చంద్రిక లింకను తన
వెల్లునొసగుచునే యుండుటచే నాటకముల విడనాడలేక కాబోలు నా
డప్పుడొక్కొక్క నాటకమును రచించుట కాతడు పూనుకొనుచుండు న
అట్లయ్యాను, దీనియందాతడెంతటి సిద్ధహస్తుడో దీని జ
దెల్లమగును. గురుతుల్యులగు శ్రీ గురుమూర్తి నిది యాకర్షించు
టబ్బురముగాదు.

తన్నాశ్రయించిన వారి కేనాడు దయాళుడు తోంటచేతిజూ
వలేదు. అట్టియెడ శిష్యసంతానమును సౌభాగ్యవంతముజేయు నా
డియ్యకొను టెంతయు నాతనికి తగినదే. కాని, దానిని ప్రదర్శింపగ
జూడవలె ననుకొనిన వారి కోర్కె దీరకుండగనే వారు దివంగతులగు
శ్రీ శంకరరావున కల్లాపాతమే.

దురాశచే దుఃఖభాజనుడైన దౌర్భాగ్యుడు అజితసింహుండు.
అతని రాజ్యకాంక్షయొక్క చరిత్రయే యీ నాటకము. దీనిని, జీవి
తమునందాశ నేమాత్రమెరుగని శ్రీ గురుమూర్తి కంకితమొసర్చు
టచే యశఃకాముడైన గురువును తద్భక్తుడగు శిష్యుడును గూడ
ధన్యులు.

ద్రోణంరాజు చిన కామేశ్వరరావు.

# విజ్ఞప్తి

"రాజ్యకాంక్ష" యను ఈ నాటకమునకు మూలము రాజస్థానకథావళిలోని అమరసింహుని రాజ్యమును భుక్తాసింగు అపహరించుట యనుగాథ. మిగిలిన యితివృత్త మంతయు స్వకల్పితము. ఈ కథావస్తువును నాటకరూపమున వ్రాయవలె ననెడి సంకల్పము చిరకాలము క్రిందటనె కలిగినను, నాటక రచనకు వలయు ప్రాపంచికానుభవమును గడించినగాని వ్రాయ సాహసింప విరమించితిని. ఒకనాడు ప్రసంగవశమున నా మిత్రులు కీ॥ శే॥ శ్రీ కోలవెన్ను అనంతకామేశ్వరరావు ఈ కథను నావలన విని ప్రదర్శనయోగ్యమైన నాటకమును రచింప నన్ను పురికొల్పెను. ఆతని ప్రోత్సాహమున 1943 నవంబరు నెలలో ప్రారంభించి తీరిక కల్గినపుడెల్ల వ్రాయుచు రెండుమాసములలో దీనిని ముగించితిని.

నాకు భాషాజ్ఞానము స్వల్పము. అయినను చారిత్రకగాథయగుటచే గ్రాంథికమున వ్రాయసాహసించితిని. దోషములు మెండుగ నుండవచ్చు. చదువరులు మన్నింతురుగాత ! ఇతివృత్తము, పాత్రపోషణము రంగవిభజనము, రసోత్పాదక సన్నివేశములు, నాటకరచనకు ప్రాధాన్యములనితోచి చిన్ననాటనుండి రంగస్థలముపై నాకుగల యనుభవమును పురస్కరించుకొని యీరచనకు పూనుకొంటిని. నాప్రయత్నమెంతవరకు ఫలించినది చదువరులే నిర్ణయింప సమర్థులు.

ఈ రచన పూర్తియైన పిమ్మట నాకు పూజ్యులును, భ్రాతృసమానులు నగు శ్రీ డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారికి దీని నంకితమిచ్చి నా ఋణము దీర్చుకొన సంకల్పించితిని. ది. 10-6-48 వ తేదీని

డాక్టరుగారి వసతిగృహమున పలువురు మిత్రుల సమక్షమున దీనిని వారి కంకిత మొనర్చితిని. దీనిని ప్రదర్శించి చూడవలెననెడి వారి యాశ ఫలించక పూర్వమే వారు దివికేగిరి.

డాక్టరుగారి యాశయ నిర్వాహకసంఘమువారు దీనిని దయతో నచ్చొత్తింప బూనుకొనినందులకు వారికి కృతజ్ఞుడను. ఆశయ నిర్వాహక సంఘకార్యదర్శియు, నా మిత్రులును అగు శ్రీ ఓగిరాల వెంకట సుబ్బారావుగారిని, ఈ గ్రంథ ప్రచురణలో చూపినశ్రద్ధకు, ప్రశంసింపక తీరదు. త్వరలోనే పై సంఘమువారు దీనిని ప్రదర్శించుటకు కూడ పూనుకొనియున్నారు. సహృదయులు నాకు తగు ప్రోత్సాహమిచ్చి క్రొత్తరచనలకు పురికొల్పుదురు గాక!

రాజమండ్రి,
5—7—1949.

అంకరాజు శంకరరావు,



# మనవి

ఈ "రాజ్యకాంక్ష" రూపకమును గ్రంథకర్త శ్రీ అంకరాజు శంకరరావుగారు 10-6-48 తేదీన డాక్టరు పాలకోడేటి గురుమూర్తి గారికి డాక్టరుగారి భవనమున సమావేశమైన మిత్రమండలి యెదట అంకితమొసగిరి. స్వీకరించినకృతి చెదపురుగులపాట్టలో జీర్ణించిపోకుండ, కృతి సార్థకమగునట్లు ప్రజలలో సారస్వతకాంక్ష ప్రబలునట్లు యితోధికప్రచారము తమకావ్యము వలన కూడ ప్రాప్తించవలెనని డాక్టరుగారు ఆశించిరి.

"రాజ్యకాంక్ష" కావ్యము దృశ్య ప్రబంధమగుటచే, తనజన్మ మెంతవరకు సార్థకము చేసుకొనగలిగినదో దానిని ప్రదర్శింపజేసి చూడగోరిరి. ఈ మాత్రమైన చేసినగాని తాము కృతి స్వీకారము చేయుట వెకిలితనమని వారు ఘట్టిగా నమ్మియుండిరి.

అప్పటిలో యీ కావ్యప్రచురణ, ప్రదర్శనములకు అవకాశ మిచ్చినదికాదు. విధి తలవని తలంపుగా వారిని వరలోకమున జేర్చినది.

ఇంతకాలము శ్రీ గురుమూర్తిగారు తమ ధన, ప్రాణములను, జవసత్వములను,ఏ ప్రజకంకితమొనర్చిరో ఆ ప్రజ వారియుద్దేశములను కొంతవరకైనను నెరవేర్ప సంకల్పింపక పోవుట కృతఘ్నతయే కాగల దనియెంచి, చివర రోజులలో వారు తరచు వ్యక్తీకరించిన యీ యుద్దేశమును నిర్వహించుటకు మేము పూనుకొని యీ గ్రంథ ముద్రణకు గడంగితిమి.

ప్రకాశకులు.

# ఇందు వచ్చు ముఖ్యపాత్రలు

| | | |
|---|---|---|
| అమరసింహుడు | ......... | యోధపురాధీశ్వరుడు |
| భుక్తాసింగు | ......... | అమరసింహుని పినతం( |
| జనార్దనశర్మ | ......... | యోధపురమహామంత్రి |
| విశ్వావసువు | ......... | సహాయమంత్రి |
| బలవంతసింహుడు | ......... | కళ్యాణదుర్గాధ్యక్షుడు |
| అజితసింహుడు | ......... | బలవంతుని తమ్ముని కొ |
| రూపుసింహుడు | ......... | అజితుని సోదరుడు |
| గోపాలవర్మ | ......... | కళ్యాణదుర్గములోనిసర్దా |
| వీరసింహుడు | ......... | భుక్తాసేనాని |
| బలదేవుడు | ......... | భిల్లరాజు |
| వీరమల్లు<br>రాయగండడు<br>జెగజెట్టి<br>గడానాయకుడు | | భిల్లులు |
| అలీఖాన్ | ......... | అజితుని బానిస |
| నందుడు | ......... | జనార్దనుని అనుచరుడు |

ఇంకను, కృషీవలులు వత్తురు.

స్త్రీలు.

| | | |
|---|---|---|
| ముక్తాబాయి | ......... | బలవంతుని యిల్లాలు |
| కమల | ......... | ముక్తాబాయిసఖి |
| మోతి | ......... | భుక్తా యుంపుడుకత్తె |





ఓం.

# రాజ్యకాంక్ష



## ప్రథమాంకము



### రంగము 1.

స్థలము:- యోధపుర పరిసర ప్రాంతము.

కాలము:- సంధ్యాసమయము.

[ ప్రవేశము - సన్యాసి వేషమూన, జనార్దనశర్మ ]

జనా:- ఓ! యోధపుర సామ్రాజ్యలక్ష్మీ! జోహారు. చతురధది వేలావలయిత భూమండలమున కలంకారమగు భారతమాతగళసీమ వెలుంగొందు రసపుత్రతారహారంబున మణిపూసవై, అసమాన శౌర్యధనుల, యోధాగ్రేసరుల గని, యోధపురమను నీనామంబును సార్థకం బొనరించుకొంటివి. పవిత్ర లూనానదీ తోయంబులచే పరిపూరితమ్మై, అభేద్యంబులగు గిరిదుర్గంబులచేతను, దుర్గమకాంతారంబుల చేతను, సహజంబగు, నీప్రకృతి రామణీయకతను, తలంచుకొన్న కొలదియు, నా మేను పులకాంకురంబగుచున్నయది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

ఇట్టి నా జన్మభూమిని విధివశంబున వీడవలసె. తిరిగి భవదీయ
చరణసేవ యొనర్చు మహద్భాగ్య మెన్నటి కబ్బునో కదా!

(తెరలో కోలాహలము - భేరీనినాదము)

ఏమిది? ఏమి యీకోలాహలము? ఓహో! భుక్తాసింగు నగ
ప్రవేశ విజయధ్వానములు కాబోలు! హతవిధీ! ఎంతలో ఎం
మార్పు! సకల సద్గుణ సంపన్నుండును, ప్రజాక్షేమాభిలాషి యు
ధర్మాచరణుండును, తరుణుండునగు యమరసింహుడేడ! ఈ క్రూ
స్వభావుండును, క్రూరాచారుండును, కుతంత్ర ప్రావీణ్యుండును
ధనపిశాచావేశా పరుండునగు భుక్తాసింగేడ! సోదరపుత్రుండ
యైనను భావింపక, మాయోపాయంబున, నమరసింహుని రా
జ్యాపహరణంబునకు బూనుకొనిన, యీ దుష్టాత్మునకు ప్రతి
ద్ధానమా !

(తెరలో కలకలము - జనఘోష)

అరువుడు. మీగొంతులు బ్రద్దలగునట్లరువుడు. వత్సరంబైనన
కాలేదే. అమరసింహుని పట్టాభిషేకోత్సవము నతివైభవము
జరిపి! నాటి యలంకారము లైనను మాయలేదే! ఇంతలో నేయి
మార్పా! (తిరిగి జయజయ ధ్వానములు) ఈప్రజాసమూహమ
మున కెంతటి మైమరపు! పట్టెడోగిర మెవ్వరిడిన వారి వెంట
తోకాడించుచు పరువిడు, యూరకుక్కలబోలు నీమూకకెంగి
జ్ఞానమేదీ! అమరులకైనను నలంకారప్రాయుండగు నమరసిం
హునియెడ నత్యాచారమొనర్చిన యీ రాక్షసున కావా
నమా ! భరింపజాల! భరింపజాల! (కన్నులమూసికొని ధ్యా
రించి) హే! భవానీ! భక్తజనప్రదాయనీ! ముక్తిదాయనీ! నీదివ్య

మంగళ విగ్రహంబును, నీకమనీయ వదనారవిందమును, నీ మంజుల వాగ్విలాసంబును, నీభక్తజన హృదయ రంజకంబులగు కరుణార్ద్రదృక్కులను, నించుక మరుగుపరచుము. భీకరకరాళ దంష్ట్రామూర్తివై, క్రోధఘూర్ణిత నేత్రివై, ప్రళయకాల మహాచండివై, మహిషాసుర మర్దనివై, నాకు దర్శనమొసంగుము. నాశత్రుసంహారణ కర్మంబునకు దోడ్పడుము. నాలో ప్రతీకారవాంఛను పురికొల్పుము, ప్రతిహింసాగ్నిని రగుల్కొల్పుము. నాలో నావేశింపుము. హే! జగదేకమాతా! లోకైకపూతా! భవ్యచరిత్రా! పాహిమాం! పాహిమాం!

ఇదే భవానీపాదపద్మములసాక్షిగా,నమరసింహుని రాజ్యప్రతిష్ఠితుని జేసినగాని యోధపురమును తిరిగి ప్రవేశింపను. ఆ! అదేమి ఆ వచ్చువారెవరు? చారుడై యుండునా? లేక...(అని చాటునకేగి పరిశీలించి) నాయనుచరుడు నందుడై యుండునా?

(నందుడు - ప్రవేశము ఆటవికుని వేషమున)

నందు:- నా యేలిక, యిందే యుండునని చెప్పియుండెగదా! చీకటులాక్రమించినవి-వచ్చియే యుండవలె.

జనా:- (పోల్చుకొని) నందా!

నందు:- స్వామీ!

జనా:- నీవేనా? (బయటికివచ్చి) వెంటనే పోల్చుకొనలేకపోతిని. నావేషమెట్లున్నది?

నందు:- ఎట్లున్నదని యడుగవలెనా? అద్దమున్నచో మిమ్ము మీరే గుర్తింపలేరని తలంచెద. మీ కంఠస్వరమునుబట్టిగాని, లేకున్న యిప్పటికిని మిమ్ము నేను గుర్తింపజాల.

జనా:- చీకటి పడుటచే గుర్తింపలేకుంటివేమో! విశ్వావసునకు నా సందేశ మందించితివా? అతడేమనెను?

నందు:- దుర్మార్గుడగు భక్తాసింగును సేవింపవలసి వచ్చినందు మిగుల చింతించెను. కాని, మహారాజాజ్ఞ జవదాటనేరక కోలకు మీరు చెప్పినప్రకారము తు-చ-తప్పకుండ సంచరి ననియెను. శక్తివంచనలేక, శత్రువంచనకు పూనుకొని నసెను.

జనా:- భక్తాసింగున కనుమానము కలుగకుండ ప్రవర్తింప వ నుడివితివా ?

నందు:- మహామంత్రులు, విశ్వావసుగారి సామర్థ్యమును శంకి చున్నారా ? సర్వవిధముల భక్తాను విశ్వాసపాత్రునిపలె రించి, శత్రుమారణోపాయంబుల నెప్పటి కప్పుడు త తెలియబరచెద ననిరి.

జనా:- మంచిది. విశ్వావసువసాధ్యుడు. చెప్పినంత పట్టు చేయగ ఇంతకు, మహారాజు అమరసింహుని వార్తయేమి ? కుటుంబము సంగతేమి ?

నందు:- అమరసింహ మహారాజులవారు, చీకటి పడకమునుపే స్థానమును, సురక్షితముగ చేరినట్లు వార్తవచ్చినదట. ఇక కుటుంబము నిర్ణీతప్రవేశమున సుఖులై యుండిరని చెప్పిరి.

నా:- నందా! ఇంతవరకును, మన యత్నము ఫలించినది. భ కృపవలన ముందుకూడ యట్లే యగుగాక! తల్లీ! మో లక్ష్మీ! నీకిదే వందనము. తిరిగి యెప్పటికో యీ జనార్దన నీవు దర్శనము. నందా! రమ్ము. నీవు నాయెడనడ సం వలయు.

(నిష్క్రమింతురు)

రంగము 2.

స్థలము:- జోధపురరాజమందిరము.

కాలము - ఉదయము

(ప్ర)వేశము - విశ్వాసుడు - భుక్తాసేనాని - వీరసింహుడు

సంభాషణ)

వీర:- అమరసింహుడు పలాయితుడైనట్లేనా? జనార్దనశర్మజాడ తెలియ లేదా ?

విశ్వా:- భీరువు. క్షత్రియజాతి యోగ్యముకాని పనియాచరించె. మరణ మొందడె; జయము నొందడె. యుద్ధరంగమునుండి పలాయితుడగుట రసపుత్రవంశమునకప్రతిష్ట. జనార్దనశర్మయే యుపాయము నెరింగించి యుండవలె.

వీర:- అమరసింహ పక్షపాతులందరును బంధింపబడినట్లేనా ? శత్రు శేషము ఋణశేషము నుంచుకొనరాదు.

విశ్వా:- నిస్సంశయముగా బంధింపబడిరి. బంధితులు కాని వారు నగరమును వీడిరి. సుక్షత్రియులు రణరంగమున నిహతులైరి. జోధపురరాజ్యలక్ష్మి భుక్తాసింహ హస్తగత మైనది.

(ప్ర)వేశము భుక్తాసింగు సపరివారముగ)

పరివారము:- జయ జయ రాజమార్తాండ చండప్రచండ శ్రీ శ్రీ శ్రీ భుక్తాసింగు మహారాజాబహద్దురు వారికి జై.

విశ్వా:- మహారాజులవారికి స్వాగతము. జోధపురరాజ్యలక్ష్మి నేటికి సనాథయైనది. భుక్తాసింగు మహారాజులవారి పరిపాలనా సౌష్టవంబున కెడమై యల్లాడిన, పీడితజనుల వాంఛితార్థము నేటికి సమకూడినది. విద్రోహుల కుతంత్రములు నిర్మూలింపబడినవి. రాజ్యమున శాంతిస్థాపన కేలినవారి కీభృత్యుడు సర్వవిధముల తోడ్పడ సంసిద్ధుడు.

భుక్తా:- విశ్వావసూ! వీరసింహుని వలన నీ రాజసేవా పరా
నెరింగి మిగుల సంతసించితిమి. విద్రోహుల బంధించుటయ
నీవొసంగిన సహాయ్య మసామాన్యమని వింటిని. కాని-
సింహ జనార్దను లిరువురును చిక్కకుండుట శోచనీయ
అందులకు గట్టిప్రయత్న మొనర్పలేదేమో ?

వీర:- రాత్రి యంతయు విశ్వావసు మంత్రిపుత్రుడు మాతో
వారి సాంకేతిక ప్రదేశములనన్నింటిని గాలించె. కాని
తకుముందే రహస్యమార్గమున నగరు వీడియుండవలె
జాడల నరయుటకును, నగరమార్గముల శోధించుటకును,
భటుల నియమించితిమి. చారుల నలుగడల బంపితిమి,
యింతవరకును వారి జాడ తెలియలేదు.

భుక్తా:- అమరసింహుడు జనార్దనశర్మ తంత్రములకులోనై యి
గావించియుండును. శైశవంబుననుండియు తనకు రక్షకుడ
తన శ్రేయస్సునే కోరియున్న నాపై దుష్టనేరారోపణ గావి
నన్ను రాష్ట్రమునుండి వెడల నడపెను. అందులకు ప్రతిఫ
నే డనుభవించెను.

వీర:- దేవరవారి యుదారతయే వాని నింతవరకు దెచ్చినయది
లేకున్న—

భుక్తా:- లేకున్న, మొదటనే రాజ్యస్వీకరణమును నేను సంకల్పిం
అమరసింహుని పేరెత్తువారైనను, లేకుండెడివారు. ఇప్పుడై
మనము ప్రమత్తులమై యుండరాదు. ప్రజలందరకు నా
జ్ఞను వెల్లడింపుము.

- చిత్తము. దేవరవారు సెలవీయ వేడెద.

క్తా:- రాజద్రోహులైన, జనార్దన, అమరసింహులజాడల దె
వారికి గాని, వారిని పట్టియిచ్చిన వారికిగాని, పదివేల వరహ

పారితోషిక మిచ్చెదనని దెల్పుడు. విద్రోహుల పక్షమూని, రాజద్రోహమునకు సంకల్పించువారికి మరణమే శిక్ష. నగరము నుండి వెలుపలికిగాని, వెలుపలినుండి నగరములోనికిగాని పో నిచ్ఛగించువారు ముందుగ రాజానుమతిపత్రముల పొందవలెను. ప్రజలెల్లరును భుక్తాసింగునే రాజుగా నంగీకరింపవలెను. ఇందు లకు భిన్నముగా ప్రవర్తించువారు క్రూరశిక్షలకుపాత్రులయ్యె దరు. చీకటిపడినది మొదలు సూర్యోదయము వరకును, ప్రజ లెవ్వరును, తమ తమ గృహములవీడి రారాదు. అనుజ్ఞాపత్రి ములు వీరసింహునివద్దనుండి పొందవలెను,విశ్వావసూ! రాజాజ్ఞా పాలనయందు, అప్రమత్తుండవై చరియింపవలెను. వీరసింహా! దండనార్హుల దండించుటయందును, శాంతిస్థాపనయందును, నీకు పరిపూర్ణమైన హక్కుల నిచ్చితిమి.

:- దేవరవారీ భృత్యునియందు చూపిన నమ్మకమునకు కృతజ్ఞు డను. నేనిదే సైనికుల హెచ్చరించి, సర్వమును నమర్థించెదను. రాజ్యపాలనయందు, సైనికనిర్వాహ బాధ్యతనెరింగిన యేలిన వారి బుద్ధికుశలత యెంతయు ప్రశంసనీయము. డోలాందోళితు లగు ప్రజాసమూహమును, కత్తిచూపియే పరిపాలింపవలెను. మెత్తదనము నసమర్థత్వముక్రింద భావించి చెలరేగెదరు.

క్తా:- బాగు! వీరసింహా! బాగు! భుక్తాసింగు మన తత్వమును నీవు బాగుగ గ్రహించితివి. మొట్టెడువారికి జడియునట్లు మ్రొక్కెడి వారికి జడియరు. ఈ రాజనీతి నవలంబింపక పోవుటచేతనే, అమరసింహుడు నన్ను ప్రవాసమున కంపగలిగె. కావున, నేడీ కఠినరాజనీతి బ్రయోగింపవలసె. అప్పను—మరచితి—రాజో ద్యోగులలోడను, పరిజనులతోడను, రాజభక్తి ప్రమాణముల తీసికొనవలెననియు, సంశయాత్ముల క్షమింపననియు దెలుపుడు. భుక్తాసింగునకు క్షమయనునది లేదు. తెలియునా ?

విశ్వా:- చిత్తము. యేలికవారు సెలవిచ్చినరీతి సర్వమును నిర్వహింపగలవారము.

భక్తా:- విశ్వావసూ! మరియొకమాట.

విశ్వా:- దేవరవారు సెలవీయుడు వేడెదను.

భక్తా:- జోధపురసామంత జాగీరుదారులును, దుర్గాధ్యక్షులును, విద్రోహుల కాశ్రయమొసంగవచ్చును కావున, మనకులోబడియున్న సర్దారులకును, జాగీరుదారులకును, దుర్గాధ్యక్షులకును, వెంటనే విద్రోహులజాడల నరసి దెలుపవలెననియు, వారికాశ్రయమిచ్చినవారుగాని, వారిజాడల దెలిసియు, తెలుపనివారుగాని శత్రులక్రిందనే పరిగణింపబడుదురనియు, వారిపదవుల గోల్పోవుటయేగాక, రాజాగ్రహమునకు కఠిన శిక్షలకు పాలుగావలసి యుండుననియు తాఖీదుల నంపుము.

విశ్వా:- రాజ్యరక్షణకై దేవరవారెట్టి చర్యలనైనను, గైకొనవలసినదే.

భక్తా:- వారెల్లరు నీ తాఖీదు నందుకొనిన నెలదినములలోగా యిచ్చటికి వచ్చి రాజభక్తిప్రమాణముల నొసగవలెను. మీరిరువురును, కడుంగడు జాగరూకతతో మెలగవలయును. మనచారులు నానారాష్ట్రములకేగి, శత్రువుల జాడ దెలుసుకొనవలెను.

వీర-విశ్వా:- జై, భక్తాసింగు మహారాజా బహద్దరు వారికి జై.

(తెరపడును)

రంగము ౩.

స్థలము - కళ్యాణదుర్గము - బలవంతసింగు రాజమందిరము

ప్రవేశము—బలవంతసింగు, అజితసింగు.

బల:- పోక తప్పదందువా?

అజి:- తప్పనో, తప్పదో, రాజాజ్ఞ. అందును, చండశాసనుండగు భక్తాసింగు దారుణశాసనము నతిక్రమింప నెవ్వరు సాహసింతురు?

బల:- నిశ్చయమే. పోకతప్పదు. పాపము అమరసింహుడు రాజ్యభ్రష్టుడై యెటకేగెనో ! యెట్టియిడుమల గుందుచుండెనో ! సహజముగ సౌజన్యశీలుడు. ప్రజానురంజకుడు.

అజి:- అతని సౌజన్యత, ప్రజారంజకత్వము, ఆతని కాపాడగల్గెనా ? "ధరణీరాజ్యము వీరభోజ్య" మన వినలేదా ? సృష్టియందెచ్చట జూచినను, బలవంతులు బలహీనులపైని పరాక్రమించుటయే గాననగును. జలచర, భూచర, ఖేచరములందెచ్చట వెదకినను యీ ధర్మమే చెల్లుచున్నది.

బల:- భుక్తాసింగు పరాక్రమవంతుడే. కావుననే, అమరసింహుని నిర్జింపగలిగెను. అజితసింహా! ఈవిషయము నీవెరుంగుదువా ?

అజి:- ఏ విషయము ?

బల:- ఇందెవ్వరును లేరుగదా? గోడలకు చెవులుండునందురుకే. అమరసింహుడు, పినతండ్రియగు భుక్తాసింగు నత్యంతగౌరవ ప్రపత్తులతో మెలంగెడివాడు. కా—కాని—బయట చూడుము—ఎవ్వరును లేరుగద. భుక్తాసింగత్యాశాపీడితుడై యమరసింహుని బంధించి రాజ్యాపహరణమునకు ప్రయత్నించెను. జనార్దనమంత్రి ప్రతిభావిశేషమున యీ కుట్ర బయటపడెను. కాని పితృసమానుడగు పినతండ్రికి మరణదండన విధింపనేరక యమరసింహుడు భుక్తాను రాష్ట్రమునుండి మాత్రము వెడలగొట్టెను.

అజి:- దానికి తగిన ఫలము నేడనుభవించెను. చేతికిదొరికిన శత్రువును సంహరింపకపోవుట యెంతటి యవివేకము. ఆర్యధర్మమునని యిట్టి రాజనీతి ననుసరించుటచేతనే, మనరసపుత్రులీనాడు నామమాత్రావశిష్టులై పరరాజులగొలిచి బ్రతుకవలసె. కలియుగంబున, అందును నేటిభారతమున కౌటిల్యనీతిప్రయోగింపవలెను గాని, మరియొండు మార్గములేదు. ఇంతకును జోధపురప్రయాణము మాట మరచితిరి,

బల:- పోకతప్పదు—కాని—ము క్త—అబల—అమాయిక—
టరిగా నెన్నడును, యుండి యెరుగదు. ఆమె యీవియో
నెట్లు భరింపగలదని యోజించుచుంటిని.

అజి:- (తనలో) పాపమీ ముదుసలికి వడుచు భార్యయందెంతటిమో
(ప్రకాశముగా) పోనీ యీమెను గూడ దీసికొని పోరా

బల:- అమ్మయ్యో! అదిమాత్రము వల్లకాదు. ఈదుర్గమారణ్య
ముల—ఈవిప్లవదినములలో—ఆడువారితోడి ప్రయాణ
ము క్తవంటి అమాయికురాలితో.వలదు, వలదు. అసలు మ
ప్రయాణములందుగాని, విహారములందుగాని, ఆసక్తియే
మరచితి—నాప్రతినిధిగా నీవు యోధయురమున కరగి
భక్తి ప్రయాణమును జేసిన ప్రమాదమేమి ?

అజి:- భుక్తాసింగు కడు మాయావి. ఆవులించిన ప్రేవుల లె
గలడు. నీవు స్వయముగా వరుగకున్న, నీ కాతని పాలన
దిష్టములేక మొగము చాటువైచితివని భావింపగలడు.

బల:- అవునుసుమా! మంచియాలోచన జెప్పితివి. నీవు కడుమేధా
ఎంతదూరమాలోచించితివి ? తప్పక చిక్కులలో పడియుం
వాడనే. భుక్తాయాగ్రహమునకు గురియైయుందును. అం
ప్రయాణము తప్పదనియే నిశ్చయించితివి.

(గోపాలవర్మ ప్రవేశము)

గో:- రాజా! నేనిటవచ్చుచుండ ప్రాంగణమున, కొందరు బా
రులు వేచియుండి, యీ లేఖను తమకందజేయుమని యొస

అయ్యో ! దైవమా ! మరియొక తాఖీదు కాబోలును.
భుక్తాసింగు మనల నీ మన్యదుర్గమునగూడ నిలువ నీం
కాబోలు. గోపాలవర్మా! ఆలేఖను నీవేపఠింపుము.

గోపా:— (లేఖను విప్పి చదువును) "పితృసమానులును, కళ్యాణదుర్గాధ్యక్షులునగు శ్రీ శ్రీ శ్రీ బలవంతసింగు బహద్దరు మన్యసుల్తాను వారి దివ్యపాదారవిందములకు—

ల:— లేఖప్రారంభము చాల గౌరవసూచకముగనే యున్నదే! లోని విషయము లెట్లున్నవో! భుక్తా సింగింత మర్యాదగ వ్రాయుట జూడ—

రాజ:— లేఖను పూర్తిగా చదువనిమ్ము.

గోపా:— "నిత్యానేక వందన శతంబు లాచరించి"

ల:— వందన శతంబులే! భుక్తాసింగు! నాకు! యేదో మాయ పన్నుచున్నాడు. తరువాత?

గోపా:— "రూపుసింహు వ్రాయున దేమన"

ల:— రూపుసింహుడా? ఏరూపుసింహుడు? మనరూపుసింహు గతించి అయిదేండ్లయినదే!

గోపా:— చివరవరకును చదువనిమ్ము. అంతయు విశదము కాగలదు.

ల:— ఆహా! రూపుసింహు సజీవుడై యుండెనా? అత్యాశ్చర్యము. గోపాలవర్మా! తుదవరకును చదువుము.

గోపా:— "ఆనాడట్లు తమవద్ద సెలవుగైకొని, విదేశయాత్రా కౌతూహలినై కాందహారు చేరితిని. ఆ ప్రభువు నా రణకౌశల్యమును, పరాక్రమ విజృంభణమును దిలకించి, తనయాస్థానమున గౌరవ మర్యాదల నొసంగి. పిమ్మట నన్నాదరించి, బహూకరించి, తన సేనానులకు వ్యూహనిర్మాణాదుల నేర్పఁబనిచెను. ఇట్లుండ నొకనాడాకస్మికముగ పారశీకభూజాని మాప్రభునిపై దండెత్తెను. సంకులసమరంబు సాగె. తీవ్రగాయములకు గురియై ఆరణభూమి నేను మూర్ఛిల్లితిని. నేను మేల్కొను నప్పటికి పారశీకుని శిబిరమున బందెగానుండుట దెలిసికొంటిని. కాని యాప్రభువు

నా కరలాఘవంబును, పరాక్రమలీలను, రణోత్సాహ ప్రత్యక్షముగ వీక్షించుటచే నద్భుతాశ్చర్యనిమగ్నుడై న రించి యెంతయు ప్రశంసించెను. నాటినుండిపారశీకమునన నే నాహావరంగమున గూలుటయేగాని, పారశీకునిచే గ బడుట యెరుంగని మా సైనికులు నేను గతించితిన భావించిరి.

"ఎట్టిప్రశంసల నందినను, జన్మభూమిని చేరవలెననెడి కో చేతను, నా శక్తిసామర్థ్యముల నాడు సేవకై వినియో వాంఛచేతను స్వదేశమునకు పయనమైతిని. కాని మిత్ర కాందహారుప్రభుని బలవంతముపై మార్గమధ్యమున నా వచ్చినది. కొలదికాలములలో తమ పాదసేవ యొనర్పరా

భవద్దర్శనాభిలాషి,

రూపసింహుడు."

ఎల:- అజితసింహా! వింటివా? మన రూపసింహుడు సజీవుడై విక్ర పేతుడై, తిరిగివచ్చుట నేడెంత శుభదినము. గోపాలవ రూపు విదేశరాజుల మన్ననలకు పాత్రుడై, బహూకృ నాతడు నేలోత్సవ మొనర్పరానుండె.

అజి:- (తనలో) ఈముదుసలి యానందమునకు మేరలేకున్నదే.

ల:- అజితసింహా! ఏమూరకున్నావు. రూపుని రాక నీకానంద సంగుటలేదా ?

జి:- తండ్రీ! ఆనందోద్రేకమున, డగ్గుత్తికపడి మాటరాదాయె ఎన్నడో మృతుడయ్యెనని తలంచిన ప్రియసోదరుని యా నము, మోద మొసంగకుండునా ? నేడు నిశ్చయముగా శు దినము.

బల:- గోపాలవర్మా! అజితరూపసింహులు పసివారలైయుండ, వీరి తండ్రి నాసోదరుడు, అకాలమరణము నొందుటయు, నాటి నుండి వీరిని నా పుత్రులవలె నాదరించుటయు, మరపురాని గాథలు.

గోపా:- రూపుసింహులు శైశవంబున మోసి, మోసి, యీ మూపులు కాయలుకాచినవి. భర్తృమరణవార్తవిని, వీరి జనని, సహగమనము సేయ, వీరిరువురను పెంచి పెద్దవారలజేసిన దెవరు ? రూపుసింహుని యసత్యమరణవార్త పిడుగువలెసోక, పెంచిన మోహమున నాయిల్లాలసువుల బాయుట తా మెరుంగరా ? రూపునిరాక, యీ రాష్ట్రమునకు రాకయని భావింపనగు. తొల్లింటి రాజపుత్రవీరుల యశశ్చంద్రికల దశదిశల ప్రసరింప జేసి భారతదేశ గౌరవమును ప్రతిష్ఠించిన రూపుని యెన్నివి ధముల ప్రశంసించినను దనివితీరదు.

అజి:- అత్యానందమున మీ రిరువురును, కర్తవ్యతా విమూఢు చున్నారేమోనని భావింపుచున్నాను. యోధపుర ప్రభు భుక్తాసింగు రాజు వీనిగూర్చి యించుక యోజింపుడు.

బల:- రూపు నేడో రేపో రానైయున్నవాడు. అతడు వచ్చిన పిమ్మ యీప్రయాణమును గూర్చి యోచింతము. అజితసింహా పోవుదము. (నిష్క్రమింతురు)

రంగము 4

స్థలము: అజితునిమందిరము.

కాలము: ఉదయము

ప్రవేశము: అజితుఁడాలోచనతో

అజితు:- రేయెల్లనిద్దురలేదు. ఆలోచనాపరంపరలో నిమగ్నుడనై క ర్తవ్యతా శూన్యుడనై తిని. అదుగో ఉదయభానుడు. నిశీథినిం

లచే అంధకారపటలి బటాపంచలు చేసి, దివ్య తేజస్సునుద
రపి కువలయానందు డగుచున్నాడు. నాయాశాజ్యోతినికూ
గించునా? అజితసింహా! నీవెన్నడును పరాజయము నెరుంగ
వువలె నిట్లు డోలాయమానుండవగుట హాస్యాస్పదము
మీాదనున్న రూపుని లేఖదీసి) మొహరు—రూపునిదే. (
అక్షరమాల—నిస్సందేహముగ నాతనివే. రూపు సజీ
టకు సందియము లేదు—ఊఁ—నాయాశా సౌధనిర్మా
కంతరాయము గల్పించుచుంటివా? ముదుసలియైనేడో రేప
నున్న యీబలవంతుని యధికారపదవిని నిర్విఘ్నముగ
వనున్న నా కీయాటంకమా? రూపుని యాగమన వార్త
తనే యీా ముదుసలి కెంతసంతోష ముదయించినది! ఇ
రములనుండి తన్ననుదినము ననుసరించియున్న అజిత
యేమి? జరుగదు. అట్లుజరుగ నేరదు. తనకును తన యసం
రూపునకును దాస్యమొనర్చుట కీయజితు జన్మింపలేదు (అ
నతో) అజితునిశక్తిసామర్థ్యములు, అజితుని తంత్రప్ర
ములు, అజితుని కార్యసాధనానైపుణ్యత ప్రదర్శించుటకు
ము తెంచినది. రూపు—దేశాంతరగతుడైన రూపు—
పదుడైన రూపు—విక్రమోపేతుడై స్వదేశముసకరుదెంచు
బలవంతుడు తనసర్వస్వ మొసగి యాతిథ్య మొసంగుటం
నేరదు. ముమ్మాటికిని జరుగనేరదు. (గవాక్షమునుండి బ
చూచి) ఆలీ! ఆలీ!

—(ప్రవేశించి) జీ! సర్కార్! సలామాలేఖుం.

(వానివైపు చూడకయే) నీవు వట్టిమూఢుడవునుమా!

జీ! సర్కార్! తము ప్రాలాపార్లు సెప్పినార్.

ఏమి చేయుచున్నావు?

ఆలీః— సర్కార్ యెదుట నిల్చియున్నామ్.

అజీః— అదికాదురా మూర్ఖా! లోనికి ప్రవేశించుటకుపూర్వ మేమి చేయుచున్నావూ? అని.

ఆలీః— దర్వాజాకె బాహర్ పహరాసేస్తున్నామ్.

అజీః— (పచారుచేయుచు గవాక్షమునుండి బయటచూచి) బయటనెవ రున్నారు?

ఆలీః— మేము పహరాసేస్తుండామని తమ్ముకు మన్విసేశాము సర్కార్.

అజీః— ఛీ! మూర్ఖా!

ఆలీః— జీ! సర్కార్.

అజీః— ఇటు నెవ్వరును పోలేదా?

ఆలీః— మా కీచూపుల్కి తగల్లేదు సర్కార్.

అజీః— నీపహరా యిదియేనా?

ఆలీః— మేం, పహరాచేసేటప్డు—మాదీనూవు—పహరామీాదే నిల్చి యుంటుంది సర్కార్. బయటవచ్చిపోయేమనుసుల్కి మూాడ డాన్కి—మేం పహరా యిడ్చియెల్లం సర్కార్.

అజీః- మంచిపహరాయే. ఇటురా! ఈగవాక్షమునుండిచూడు.

ఆలీః— సర్కార్.

అజీః— అక్కడ యేమి కనబడుచున్నది?

ఆలీః- (అట్లే చూచుచుండును) ఖాగ్ దిఖాతాహై.

అజీః- మూర్ఖా! మరియేమియుచూడలేదా!

ఆలీః— ఆకాశాన సూరజ్, భూామమీాద మొక్కల్, మొక్కల్ మీాద పూల్ ఉన్నాయి సర్కార్.

అజీః— నీవు పట్టి పశువువు.

ఆలీః- జీ! సర్కార్! తమ్ము్మేతాయేస్తార్. తమ్ముకు సేవాచేస్తాం.

అజీః- అటుచూడు, ఆపూాలమొక్కలనడుమ నెవరు?

అలీ:- హాదదీ మాకీనూశాం. అది హాడ్వాడ్ మాదిర్ ఉంది.

అజి:- ఆమె యెవరో సరిగాచూడు.

అలీ:- సఛ్ హై అదీ హాడ్వాడ్ సర్కార్.

అజి:- ఛీ! వదరుబోతా! ఆమెకమలయేనా! చూడు.

అలీ:- సర్కార్—హాసమ్మగారి మన్ని ఖమలమ్మ అదే సర్కార్.

అజి:- నీవు వెంటనేపోయి, ఆ కమల నిటుదీసికొనిరా. అధికవ్రి... చేయక, అజితసింహులు లోకసారి యిటురమ్మనిరని దెల్పుము.

అలీ:- జీ! సర్కార్! (సలాంచేసిపోవును.)

అజి:- ఈ కమలను చూడగనే నాకొక యూహాపొడమినది. అది ... చునా?—అజితసింహా! నీవు కృతకృత్యుడ వగుదువా? ... త్నించిన, ఫలింపకుండునా! ఈమె బలవంతసింహుని ... భార్యకు అంతరంగిక యరణపు పరిచారిక. ఈమెనాకు ... యుపకరింపవచ్చు.

అలీ:- (కమలతో ప్రవేశించి) సలాం, సర్కార్ వార్కి! ఖమలమ్మ గా... మీకీ దఖల్ చేస్కున్నామ్.

అజి:- నీవు బయట నుండుము. ఎవరినీ రానీయకుము.

అలీ:- సిత్తం-సిత్తం (సలాము చేసిపోవును)

అజి:- కమలా! ఉదయభానుని, కరస్పర్శచే వికసితమైన కమలపు శోభను హసించు, నీముఖకమలము కమల యను నీనామము సార్థక మొనర్చినయది.

కమ:- అతిశయోక్తి. నాకు సామ్యమువనే శోభ యలవడునా?

అజి:- నిజముగా. ముఖస్తుతియని భావింతువేమో కాని, నీయసా... సామాన్య సౌందర్యము, నీవిలాస సంపద, నీసౌజన్యత, సుమధుర వాక్సుధ, నీనిర్మలభావము, యెట్టి రాణివాసపు... కైనను యలవడుట దుర్ఘటము.

మీరేమో వింతగ మాట్లాడుచున్నారు. నన్ను పిలిపిం
కారణ మేమో తెలుపగోరు చున్నాను.

కూర్చుండుము. కమలా! నిన్ను చూచినప్పుడెల్ల నా భావ
క తుపానువలె చెలరేగు చుండును. ఇంతటి లావణ్యతగల
లతాతన్విని సృజించిన బ్రహ్మ ఒరుల కూడిగము నేయు
మట, వాని చంచలభావము నెంతయు చాటుచున్నది
— !

—య్య! నేను వేగ మేగవలయును. మా చెలి ప్రభాతపూజకు,
సుముల కూర్పవలయు, నాకు సెలవొసంగుడు.

— ! ఏమి యీ మాటలసాంవు. నిశ్చయముగ నీ విట్టి
డిగమునకు తగవుసుమా!

—య్య! నన్నేల యెగతాళి చేయుదురు? ఎట్టి యూహల గల్పిం
, యీ కమల దీనయగు తన నెచ్చెలిని వీడునంతటి సాహ
రాలు కానేరదు. తన జీవితము నామె సేవకై యర్పించిన
.

మీ నెచ్చెలి దీనయా? వింతగ మాట్లాడుచుంటివి. కళ్యాణ
ధ్యక్షుడై, మన్యప్రాంతములకెల్ల మేటిప్రభువై, సకల
దాసీ జనముచే పరివేష్టింపబడి, ఐశ్వర్యవంతుడగు, బల
సింగును, మా పెదతండ్రిని చేపట్టిన, మీ నెచ్చెలి దీనయా?
రా! ఇంతకన్న యదృష్టవంతు లెవ్వరు?

—య్య! ఎందరు దాసదాసీజనంబులు గాని, యెంతటి యైశ్వర్య
ని, మా నెచ్చెలికి హాయిగూర్చకున్నవి. ఆమె మనోవీధి
పుడును కారుమబ్బులు క్రమ్మియుండును, మానసికముగ
యాతన ననుభవించుచున్నది.

—! అంతటి మనోవ్యధకు కారణమేమై యుండునో,

కమః- (కండ్లనీరుక్రమ్మ పూర్వగాథను జ్ఞాపకము చేసుకొనుచాని
ఆదియొక పెద్దగాథ; విషాద పరిణయగాథ.

అజి:- అయ్యో! నే నెన్నడెరుంగనే, అట్టి స్త్రీరత్నమున కుపకరి
నా జన్మ మేల? ఆమె యాతన గడువబెట్టుట నావశమగు
వేగ మెరింగింపుము. సంసిద్ధుడ.

కమ:- మీరు కాదుగదా, ఆదైవమైనను, ఆ యాతన తొలగింప
ఎంతటి యాత్మార్పణము! ఎంతటి త్యాగము! స్త్రీ మాత
యట్టి త్యాగమొనర్పగలదు. అట్టి త్యాగమూర్తి సాన్నిధ్య
నెల్లప్పుడు వర్తించు నేను, స్వసుఖము నొల్లకుండుట
ఘనతయా?

అజి:- కమలా! మీ నెచ్చెలి ప్రసంగమును దెచ్చి, నీ హృదయ
గొప్ప యారాటమును, ప్రేరేపించితి ననుకొందును. నిన్
కలవరపరచిన, యా విషాదగాథ నెరింగించి, నీహృదయ
మును కొంత పంచియిమ్ము. అయ్యో! మాపెద తల్లి
వ్యథను దెలిసికొన నామన మెంత తొందరపడు చున్నది.

కమః- మా నెచ్చెలి చిరుతప్రాయము నుండియు,రూపుసింహుని ప్రే
చిన యది. వారిప్రేమ, దినదిన ప్రవర్థమానమై, అనంత
అచంచలమై, తనరార జొచ్చినయది. ముక్తాబాయి దలిదండ్ర
కూడ రూపునకామె నీయ వలెననియే నిశ్చయించిరి.
రూపుసింహుడు యుశః కామియై విదేశంబుల కరుగుటయు,
కొన్ని వత్సరము లాతని వార్తయే తెలియ కుండుట
పిమ్మట యాతని యకాల మృతవార్త వినుటయు తటస్థించి

అజి:- ఎంత చిత్రము! ముక్తాబాయి బలవంతుని యిల్లాలగుట
సంభవించెను ?

కమ:- ముక్తాబాయి యీ దారుణవార్త విని జీవచ్ఛవంబువోలె ప్రొద్దు పుచ్చుచుండెను. ఆమె తండ్రి బలవంతసింహునకు ఋణపడి యుండెను. అది సాకుగా గొని, బలవంతుఁడు ముక్తను తన కొసంగినచో ఋణవిముక్తుని జేసెదనని కబురంపెను. ఆమె తల్లి దండ్రులు, బలవంతుని, తిరస్కరింప నేరకయు, ముక్త యభీష్టమున కెదురాడ నేరకయు, కటకటంబడిరి. బలవంతసింహుని బలవంతము హెచ్చినకొలదియు వారియాతన యధికమయ్యెను.

అజి:- పాపము! ఆతలిదండ్రులు, బలవంతుని తిరస్కరించిన, తమసర్వస్వము నాశనమగునని భయపడిరి కాబోలు.

కమ:- భయపడుటయేకాదు, బలవంతుడు తనకోర్కె నెరవేర్పకున్న వారి వినాశనము తప్పదనియే కబురంపెను. ఇది యంతయు కనిపెట్టుచున్న ముక్తాబాయి, తలిదండ్రులను, విపత్సముద్రము నుండి తప్పించుట కాత్మార్పణ మొనర్చెను. స్త్రీ తప్ప యింతటిత్యాగ మొనర్ప నెవ్వరు సమర్థులు ?

అజి:- ఎంతటివిషాదగాథ ! నిస్సహాయురాలగు, నీనెచ్చెలి కనపరచిన సేవయొనర్చు, నీభాగ్యమే భాగ్యము. నీసుఖమును, నీభావి సౌభాగ్యమును కూడ గణింపక, యామె సేవకై యాత్మార్పణ మొనర్చిన, నీత్యాగ మామెత్యాగమునకన్న వేయిమడుంగు లధికము. కమలా! త్యాగమూర్తివి. నిశ్చయముగా నీయట్టి స్త్రీరత్నమును చేపట్టగల్గినవాని జన్మయే సార్థకము.

కమ:- ఆర్యా ! మీ పొగడ్తకు నే నర్హురాలనుగాను. నేనొక యువకుని చేబట్టి, నాచెలిని విడనాడజాలను. ఈ కమలకట్టి ద్రోహచింత యెన్నడును జనింపదు.

అజి:- కమలా! నేను మాత్రము నీ నిశ్చయమున కెదురుచెప్పగలనా? నిన్ను చేపట్టదలచిన యువకుడు, నీయభిప్రాయముల నెరింగి,

వానిమన్నించి, తదనుగుణముగ వర్తించు నేని, నీయభ్యంత
మేమి ?

కమ:- అయ్యా! ఏమి యీ విషమ ప్రశ్నలు ? నానెచ్చెలి సౌఖ్య
నాకు ప్రధానముగాని, నా సుఖముగాదు.

అజి:- ఒక వేళ నీనెచ్చెలినుండి నిన్ను వేరుజేయక, నీయాశయము
కంతరాయము గల్పింపక, నీకనువర్తియై జరించుటకెయ్యో
యువకుడు లభించెనేని, వాని చేబట్టుదువా ?

కమ:- (ఆశ్చర్యపడి పలుకనేరక యూరకుండును).

అజి:- కమలా ! నిన్ను జూచినదాదియు, నీ సౌజన్యత నా మనస
నాకర్షించినది. నేనింతదనుక నవివాహితుడ నగుట నీయట్టి
కన్యారత్నము లభింపకుండుటయే. నీవు నీ నెచ్చెలిని వీ
నక్కరలేదు. నాజన్మ సార్థకమొనర్పుము. చూడు——(అని చే
పట్టుకొనును).

కమ:- ఆహా ! నే నేమైతిని. ? నాతల తిరుగుచున్నది. నా చేయి వ
లుము (అని చేయి విదల్చుకొని) నా చెలి పూజాసమయము మ
క్రమించుచున్నది. నే పోవలయును.

అజి:- కమలా! ఆలోచింపుము. తొందర లేదులే. నీయట్టి లావణ్యవతిని
సుగుణఖనిని చేపట్టి యానందడోలికల నోలలాడింపనున్న యీ
అజితుని మరువకుము.

కమ:- అయ్యా! నాకు సెలవొసంగుడు, నేనుపోయివచ్చెద. (పోవును)

అజి:- ప్రదర్శనము బాగుగనే నడచినది. అంత పాడుగలేదు. (ఆలో
చించి) ముక్తారూపుల ప్రణయగాథ-అక్కరకు రాగలదు.

కమ:- (తిరిగిప్రవేశించి) అయ్యా! మీ సేవకుడు నన్ను పోనిచ్చుటలేదు.

అజి:- అలీ !

అలీ:- (ప్రవేశించి) సలాం, సర్కార్. ఏమి సెలవు?

అజి:– ఏమిరా పొగరు ? ఈమెనేల యాటంకపరచితివి ?

ఆలీ:– సర్కార్ — మీరు సెప్పిందిలాగ సేశామ్.

అజి:– ఏమిరా నీకు చెప్పినది ?

ఆలీ:– సర్కార్. 'ఎవర్నీ రానీకు' అని సెప్పినార్. అందుక్కసేత యీ హమ్మగార్కి లోపల్నుంచి రానీలేదు సర్కార్.

అజి:– ఛీ ! మూర్ఖా ! ఎవరినీ రానీకు మని చెప్పినందులకా యిది. కమలా! వీడు శుద్ధమూర్ఖుడు. మరియొకలాగు తలంపకుము. ఈమెను శుభూర్పణ వేయుము. ఎన్నడును యీమె ప్రవేశమున కభ్యంతర పెట్టకుము. తెలిసినదా ? జాగ్రత్త.

ఆలీ:– (వంగి) హమ్మగారూ ! ఖమ్‌లమ్మగారూ ! మాకీ మాఫ్‌కీజియే. మీకీ సలాం సేస్తాంమ్.

కమ:– (నవ్వుచు పోవును).

(తెర పడును)



ఓం.



# రాజ్యాకాంక్ష

## ద్వితీయాంకము

### రంగము 1

స్థలము: అరణ్యము

ప్రవేశము: అమరసింహు కూర్చునియుండును. ఎదుట భి నృత్యగానములు చేయుచుందురు—అనంతరము.

వీరమల్లు:– ఏలికా! శెలవైన, యీభిల్లుల వారివారిపనులపై దను.

అమర:– అట్లేకానిమ్ము.

వీర:– ఓరీ! రాయగడా! నీవు నీముఠాతోపోయి, యీయడవి నలుదిక్కులు పరికించి, క్రొత్తమానిసు లెవరైనను కనబడి వెంటనే బంధించి తీసుకొనిరా. ఓరీ! జెగజెట్టి! నీవు అమర మహారాజులుంగారికి యేయాపదయు రాకుండ కావు కాయుచుండుము, ఓరీ! గడానాయకా! నీవుసీ లలో నేడు వేటకరుగుము. ఇది మనయేలిక బలదేవ యాన. త్వరగపొండు.

భిల్లులు:- దండాలుసామీ! దండాలు. అమరసింగ మారాజులక్కజై.
(పోవుదురు)

అమ:- వీరమల్లూ! మీయాతిథ్యమును మేమెన్నడును మరువజాలము. ఈయరణ్యమునందు సహితము, మాకెట్టిలోటును రానీకుండ వేయివిధంబుల కనిపెట్టుచున్న శ్రీబలదేవుని యొక్కయు, అంతకు పదిరెట్లు కంటినిరెప్పవోలె గాచుచున్న మీయొక్కయు ఋణ మెట్లు తీర్చుకొనగలమో తెలియకున్నది.

వీర:- అయ్యా! యోధపురమున కధినాధులై సకలభోగముల ననుభవించు మీరు, నేడొకభిల్లనాయకుని యాతిథ్యము నింతగా కొనియాడుట తమకు మాయందుగల వాత్సల్యతను దెలుపుచున్నది.

అమ:- వీరమల్లూ! మీరెంతటియాదరము చూపుచున్నను, దురాత్ముడును, మాయావియు నగు, భుక్తాసింగునకు తగిన ప్రతీకారమొనర్చినగాని, నామనము శాంతినొందదు; పావన లూనానదీ తోయముల నోలలాడి, యోధపుర గిరిదుర్గప్రదేశముల విహారమొనర్చి, భుక్తాను రణరంగమున నోడించి బందెగాగొన్నగాని యమరసింహునకు నిద్రయుండదు.

వీర:- దేవా! కాల మెల్లపుడు నొక్కమాదిరియుండదు. అమవసపోయిన పున్నమ రాకపోదు. బలదేవులు సర్వసన్నాహమును చేయుచున్నారు. బలవంతుడును, మీదుమిక్కిలి కుత్సితుడునునగు భుక్తానుజయించుట యంతగాదు. త్వరలోనే మనప్రయత్నములు ఫలించుగాక.

(ప్రవేశము: ఒకభిల్లుడు)

భిల్లు:- జయము, జయము దేవరవారికి. బలదేవరాజులుంగారు మరొక క్రొత్తమానిసితో వచ్చుచున్నారు.

అమర:- రానిమ్ము. (భిల్లుడుపోవును)

(ప్రవేశము బలదేవుడు: జనార్దనశర్మ)

అమ:- (లేచి నమస్కరించి) ఆహా! ఎవరోయనుకొంటిని, నా
దైవమే! మహామంత్రులు జనార్దనులకు మాయభివాదము.

జనా:- అభీష్టసిద్ధిరస్తు. వత్సా! కుశలమా.

అమ:- మాపాలిట జనార్దనులగు, శ్రీమన్మహామంత్రి జనార్దనుల
కటాక్ష ముండ, కుశలమున కేమిలోటు. శ్రీబలదేవుడు
బలమునెల్ల నా రక్షణకై వినియోగించెను. నాకు యోధపురమ
కంటెనిచ్చుటకేసదుపాయము లెక్కడు సమకూర్చుచుండి
బలదేవుని ఋణమెట్లుతీర్చుకొందునా తెలియకున్నది

జనా:- వత్సా! ఆతని రాజభక్తియట్టిద. భుక్తాసింహ దారుణశాసన
లకు, సామంతులెల్లరు, భయకంపితులై జోహారు లొసంగ,
న్యాకపరిభువగు, ఈబలదేవుడు, ధర్మరక్షణకై, యాతని ప్రతి
టించి, తమ కండయై నిలిచె. ఆర్యులము, నాగరికులము పరి
జించి, భీరువులై దుష్టపరిపాలనకు తలయొగ్గియుండ, దుష్టశి
శిష్టరక్షకుండగు యాపరమేశ్వరు డీబలదేవరూపమున ధర్మప్ర
ష్ఠాపన గావింప సంకల్పించి యుండబోలును.

బల:- దేవా! మీరెద్దియోయీయాటవికుని పెద్దజేసిపలుకుచుండిరి,
కాలమునుండియు, యోధపురసామ్రాజ్యము ప్రివునకే
స్వచ్ఛందవాయువులబీల్చుచు, వీరవిహారము చేయుచున్న, వ
కాతిథ్య మొసగి, బాసటయైనిలుచు టొకఘనకార్యమని తల
చుటలేదు. మేముచేయవలసినవిధిని, నిర్వర్తించినపుడు దా
నింతగపొగడనక్కర లేదు. మహారాజులును, మహామంత్రులున
ము మాజ్ఞాపించి, యీభృత్యునివలననగు సేవలందుకొన ప్రార్థ

:- బలదేవా! నీవాక్కులు, నీ సౌహార్ద్రతను, తెలుపుచున్నవి
సభ్యజాతులమని గర్వించువారు సాహసింపని కార్యము నక

నీవు సిద్ధపడుట జేసి, ప్రస్తుతింపవలసెను. ఆర్యా! మీరాకను గూర్చి చెప్పరైతిరి? మనయత్నము లెట్లున్నవి?

నా:- శ్రీమన్మహారాజులవారు సపరివారముగ, నిర్ణీతప్రదేశమున సుఖులై యుండిరి. వారికేలోటును రాకుండ సమస్తమైన యేర్పాటులు చేయుటయైనది. ఇక శత్రుపీట మన చారు లతిచాకచక్యముగ, మెలగుచున్నట్లువార్త లరుదెంచుచున్నవి. త్వరలోనే మహావిప్లవ మగ్నిపర్వతమువలె విజృంభింపగలదు. భక్తాయందలి భయాతిరేకమున బయట పడలేకున్నను, అసంతృప్తి యందరి యందును వ్యాపించియున్నది. సమయమునకై వేచియుండిరి. భక్తాసింగు దారుణశాసనము లధికమైకొలదియు, సామ్రాజ్యము నందలి విప్లవోద్యమమునకు మరింత దోహదముగలుగుచున్నది.

అమ:- ప్రజలయందు నిరాశ, నిస్పృహ, యావహింపకమునుపే, యీ విషమపరిస్థితు లంతరింపజేయు, సర్వప్రయత్నములు జరుగుచున్నట్లును, యీ దుష్టనియంతపరిపాలన మనతికాలముననే తుదముట్టుననియు, రహస్యప్రచార మవసరమేమో! త్రికాలవేదులు తమకు నేను చెప్పదగినవాడను గాకున్నను, చాపల్యమున చెప్పసాహసించితి.

నా:- వత్సా! అమరసింహా! సర్వమును సుసిద్ధము. ప్రజలెవ్వరును యీ పరిపాలనకు సుముఖులుగాలేరు. కాని, సామంతులును, దుర్గాధ్యక్షులును, రాజసేవకులును, తమ పదవులకై ప్రాకులాడుచుండిరి. వారైనను, భక్తాయందలి సదభిప్రాయముచే గాదు. విద్రోహ ప్రయత్నములు విఫలమైనచో తాము బయట పడిపోవుదుమనియు, భక్తా ప్రతిక్రియకు బూనుననియు భయము చేత. మనసన్నాహములు, సంతృప్తికరముగ సాగి,

విజయసాధనములగునేని, సర్వతోముఖమగు సహాయసంపత్తి సమకూడుటలో నాశ్చర్యము లేదు.

అమ:- ప్రస్తుతము మనకు బహిరంగముగ బాసటయై నిలిచిన దీ బల దేవుడును, నాతని యాటవిక బలమును.

జనా:- ఈయాటవికు లసమాన బలశాలులు. భక్తి కుదిరెనేని ప్రాణ మర్పింతురు. వీరిని, నవీన రణకౌశలమున సుశిక్షితుల జేసితి మేని అజేయులగుదురు. చంద్రగుప్తుని మగధసామ్రాజ్యమున ప్రతిష్ఠించిన దీ భిల్లసైనికులేగదా!

బల:- ఆ చాణక్యుని ప్రతిభయే భిల్లనాయకుల శౌర్యసాహసముల జగద్వంద్యమొనర్చినది. అపరచాణక్యులగు యీ గురుదేవుల నమ్మిన మాధైర్యస్థైర్యములు వృథగావని మా నమ్మిక.

జనా:- వత్సా! చూచితివా! యీబలదేవుని వాక్చమత్కృతి. బల దేవా! మనమింకను, యాధునిక మారణ యంత్రముల సమ కూర్పవలయును. నవీనపద్ధతుల మన సైనికులకు శిక్షణ మొసంగ వలయును.

బల:- దేవా! ఈ భిల్లు లాబాలగోపాలమును, మీ రెట్లానతిచ్చిన నట్లు వర్తింప సంసిద్ధులు.

అమ:- మేలు! బలదేవా! మేలు! నీరాజభక్తి యనన్యము. రండు భవానీదేవి నారాధింతము.

( తెరపడును )

రంగము 2

స్థలము:—అజితునిమందిరము.

ప్రవేశము: అజితు రూపు మాట్లాడుకొనుచుందురు.

అజి:- సోదరా! ఎంతవిన్నను తనివితీరకున్నయది. నీ సాహసచర్య లతి భయానకములు, నీవర్ణన లతిరమ్యములు, నీయనుభవములు

శ్రోతల నాశ్చర్యచకితుల జేయగలవు. పదిసంవత్సరములలో నెంత యనుభవమును గడించితివి!

రాఘ:- సోదరా! విదేశయాత్రవలన నెట్టియనుభవము గడించినను స్వదేశమునకు తిరిగివచ్చునపుడు గల్గినయానందమునకు మేర లేదు.

తే. పరమపావనిమాతల్లి భరతమాత
యంకమునజేరి లాలననందునట్టి
భాగ్యశాలికి యిహమును బరమదెంత?
స్వర్గసౌఖ్యంబు నద్దాని సాటియగునె?

ఆత్మదేశనామోచ్చారణమాత్రమున పులకాంకితుఁడుగానిజడుండుండడు. స్వదేశరక్షణమున కుపకరింపని ధైర్యసాహసములు నిష్ఫలములు. యశఃకామినైయెంతవిహరించినను, నాజన్మదేశమగు నీభారతపుణ్యభూమిని, యీవీరరసపుత్రసీమను, స్వచ్ఛందనిర్మలవాయువుఁబీల్చునపుడు గల్గుసుఖము స్వర్గముకూడనీయజాలదు.

తే. రెక్కలార్చుచు, వినువీధి నిక్కియాడు
పక్కికున్నట్టి స్వేచ్ఛానుభవమునందు
లేశమును పరసేవలో లేదు నిజము
ఎట్టియున్నతపదవిలో నెట్టిపడిన.

సోదరా! పదివత్సరములక్రిందవిహరించిన యీ పరిసర గిరిదుర్గవనసీమల విహరింప నామన మువ్విళ్ళూరుచున్నది. చిన్ననాటివరిచయముగనినపుడెల్ల వర్ణింప నలవికాని యానందమావహిల్లుచున్నది. ఇప్పటికైనను, ముదుసలియగు పెదతండ్రిగారిసేవలోనర్చు భాగ్యమాపరమేశ్వరు డొసంగినందులకు కృతజ్ఞుడను

అజి:- పెదతండ్రిగారు నీయాగమనవార్తవిని, తన్మయులైరి. నీలేఖ వచ్చిననాటినుండియు వారియానందమున కంతులేదు. రూపు-రూపనివలువరింపని గడియలేదు.

రూపు:- వారితో తీరికగా ప్రసంగించుట కింకను సమయము చిక్క-లేదు. వారేదో రాజకార్యనిమగ్నులైనట్లు కన్పడుచున్నారే.

అజి:- అవును. ప్రస్తుతరాజకార్యములు కొంచెము క్లిష్టముగనుండి వారి కలజడికల్గించుచున్నవి. ఈ యానందసమయమున వాని నుగ్గడించి, నీమనస్సున కారాటము గల్పింప నొల్లను. క్రమముగ నెల్ల నీవె తెలిసికొందువు. గోపాలవర్మను చూచితివిగదా?

రూపు:- చూచితిని, అతడును మిక్కిలివృద్ధుడయ్యె. సరియే. పెదతండ్రిగారితో తీరికగ ముచ్చటించుట కెప్పుడు వీలుచిక్కునో!

అజి:- వారికి రాజకార్యభారముచేత తీరికయుండుట లేదు కాని- మరచితి ఆయన-ఉదయమున ప్రమదావనములో విహారమొనర్చుచుందురు. అత్తరి మంచియుల్లాసముగ నుందురు. కావున రేపటి యుదయమున ప్రమదావనమున వారిని గలిసికొని యాంతరంగికముగ మాట్లాడుకొనవచ్చును.

రూపు:- ఓహో! అట్లనా! ఉదయము మొదలుపొద్దువరకు వారచ్చట నుందురు?

అజి:- అదియంతయు నీకేల? నేనునీవద్దకు ఆలీనిపంపెదను. వాడు నిన్ను ప్రమదావనమున సకాలమున ప్రవేశపెట్టగలడు.

రూపు:- నేను గోపాలవర్మను కలుసుకొనియెదనంటిని. అతడు నాకై నిరీక్షించుచుండును. కావున పోయివచ్చెదను.

అజి:- అట్లనా! ఆత డీయుదయముననే, అత్యావసరరాజకార్యముపై పురము విడిచివెళ్ళవలసివచ్చెను. నీ వెరుగవు కాబోలును.

రూపు:- నాకు తెలియదు. అట్లైన నిపుడేమిచేయుదును?

అజి:- విహార మొనర్తము. అశ్వముల నాయత్తపరుప ఆలీకిదివరకే దెలిపి యుంటిని. పోదమురమ్మా.

(నిష్క్రమింతురు)

రంగము 3.

స్థలము - ప్రమదావనము.

ప్రవేశము: ముక్తాబాయి, కమల పాటపాడుచు పూలమాలలు గ్రుచ్చుచుందురు.

కాలము - ఉదయము.

కమ:- రాధకు ఆమురళీకృష్ణుని యందంతటి ప్రేమకు కారణమేమో? వయస్సున పెద్దదయ్యు, చిన్నికృష్ణుని ప్రేమించుటకు గత మేమో ?

ముక్త:- ఆ——ఆ——అట్లనకుము రాధతుచ్ఛసుఖమునకై ముద్దుకృష్ణుని ప్రేమింపలేదు. ఆ ప్రేమ యనంతమైనది. అది యీశ్వర ప్రేరితము. రాధాకృష్ణుల సంబంధము కేవలము పారమార్థికము. రాధ యాత్మ, గోపాలకృష్ణుడు పరమాత్మ. పవిత్రమైన పరమాశయము ఆత్మాను సంధానమేకదా. అయినను ఆ దివ్య మంగళ విగ్రహమునుగాంచి ముగ్ధులుకానివారుందురా ?

సీ॥ ఘననీలమేఘంబు కరిమ్మ క్రొమ్మెరుగునా
వసమీరు పచ్చని పటమువాని,
నిద్దంపుచెక్కుల నీటుగుల్కెడిమేటి
తాటంకద్యుతులతో దనరువాని
గగనంబునను దోచు కమలాప్తుడోయన
యురమున రత్నంబు మెరయువాని,
సుందరోన్నత లతాచూడాంకురంబన
మాళిపింఛంబుచే మలయువాని

ముక్త:- చూచితివా! (వికటముగనవ్వి) నిజము తెలిసినది. (కృష్ణనామ సంకీర్తనముచేయుచు నృత్యముజేసి తన్మయతజెందును. కమల పట్టుకొని వరుండజేయును).

రూపు:- ఎట్టకేలకు ముక్తను గాంచితిమి. కాని యామె వివశయైనది. బలవంతుని యిల్లాలు, చూలాలు, సకలదాసదాసీజన పరివేష్ఠిత, యీయరణ్యమున, నీ శిలామయ ప్రదేశమున, ఎట్టి యిడుముల గుడువ వలసెను! కమలా! మనమిపుడు చేయవలసినదేమి ?

కమ:- మన మీమెనొక సురక్షిత ప్రదేశమునకుజేర్చి, అందేదైన జలాశయ ప్రాంతమున, నొకకుటీరము నిర్మించి, యీమెప్రసవ సమయము వరకును వేచియుందము. పిమ్మట దైవ మేమినిర్ణ యించునో చూతముగాక.

రూపు:- మంచిది. అట్లేయొనర్తము.

(తెరపడును)

రంగము 2

స్థలము—అరణ్యము—ప్రవేశము—ముగ్గురు భిల్లులు.

రాయగండడు:- జనార్ధనదేవు లొచ్చాక, కడుపునిండా తాగడానికే కరువైపోయిందిరా,

జెగజెట్టి:- ఓరేయి ఆయనగారు మనమీద పగసేతసెప్పనేమురా తాగు డొద్దని. మైమరపులో యేలినోరి వనుతే మరిసి పోతామని సెప్పుంటాడురా.

గడానాయకుడు:- ఆయనగారు బెమ్మదేవుడుకాదంటా. అంచే తలా సెప్పాద్రా.

రాయ:- ఓసోసి. దేవతలంతా తాగినోళ్ళె కాదంటా, అసలు తాగుడు సమాచారం నీకు తెలుసునంటా?

జెగ:- సెప్పరా. ఇందామా సుద్దులు,

గడా:- సెప్పరా—మరి నీవు మాసోగ్గా సెప్తావంట.

రాయు:- ఇనండల్లా యెరి)మొగాల్లారా. అయినా డా దేవతలూ, రాచ్ఛసులూ, యుద్ధాలు సేసుకోంటూ, ఒకమాటారూ, ఒకమాటీసు, ఓడిపోతూ, సావులేనిమార్గం కోసమాలోచిత్తుండగా,

జెగ:- చిత్తుండగా (అని దీర్ఘమంతీయును)

గడా:- సావులేనిమార్గాలే! నా రంగా! నాకే సావునేకుంటే నా మజానూపనూ?

జెగ:- సెప్పనీరా, సాంతంగా, యెరి)పేలావన పేలక.

రాయు:- అప్పుడు, పాలసంద్రాన్ని మదించడానికి, ఆరూయిూరూ బయుద్దేరి, ఇట్టుమూత్రిని, యిూశరుణ్ణి, యేదుకోని, తరవగా, తరవగా, అయిపోయేటో పుట్టాయుంట. కడసారి అమృర్తం—అదొచ్చిందంట. అదేంటనుకొన్నావు—సుద—అది తాగితే సావునేదంట. అదే యిూకలికాలంలో "సుర" అయిందంట.

గడా:- బలే! బలే! మాసోగ్గా సెప్పావురా. నీ కీసుద్దులన్నీ యేలాగొచ్చాయిరా.

జెగ:- మ రాదేవత లప్పుడేంచాశారురా.

రాయు:- ఇట్టుదేవుడికి మొక్కి, సుదపోయడానికి, ఓరినైనా పంపమన్నారంట. ఆపాల్ని ఆయున మూంచి సొక్కైన యేసంయేసుకోని దాన్నేటంటారూ? మోగిని. మోగినై మరిపించాడంట.

గడా:- అద్దదీ! మజా. ఘుల్లుఘుల్లూమంటూ, గాజులుసేత్తోపోన్తూ, తల్కుబెల్కుమంటూ, టక్కుతూ తారాడుతుంటే, నారాజా, బళ్ళేసురిచిపోయి, తాగినారుకామోసురా, ఆరాచ్ఛసులు.

రాయు:- కాదురా. ఆ అమృర్తం దేవత లెత్తుకొనిపోయినారంటా), దానికోసం యుద్ధాలు సేసుకోని సచ్చినారంట.

గడా:- అందునేలనేకామోసురా, మన జనార్దనమంతిరిగోరు తాగుడు లేకుండా చేసేసినోరు.

జగ:- కవకనే కడుపునిండాకూడు తింటున్నాం. రాయుగడా, ఒక పద పాడరా.

రాయు:- (నృత్యముచేస్తూ పాడును)

ఓరోరి అందకాడ, ఒయ్యారి అందకాడ,
సిటూగోటూలవాడ, నీలాకాంతూలవాడ,
రారాపొన్నాలనీడ, నరసాకు సందెకాడ,
గిలుకూమట్టెలదాన, కులుకూనూపెట్టెదాన,
మెరువూచూపులదాన, మురువూముద్దులదాన,
మోమూసెందూరుదాన, మోసంపుపిల్లదాన,

గడా:- ఆగరా! ఆగరా! ఆదెవస్నూడ్రా. ఎవడో కొత్తమానిసి వత్తుండాడు. (అందరుచూతురు)

జగ:- అవున్రా. యిణ్ణి పట్టుకోని, యేలినోరి కప్పగిద్దామురా.

గడా:- ఆడెవడో ముందు తెలుసుకోవద్దంట్రా.

జగ:- పట్టుకొంటే ఆడే సెపుతాడ్రా.

రాయు:- మరైతే. మీరా రాబండసాటున దాకోండిరా. ఆడురాగానే లటాలున్మీదకురకండి. ఆపాట్నా కాళ్ళుసేతులకట్టెయ్యాలి. ఆడి సత్తువ మనకు తెల్దుగా. అందుసేత, ఆడికేమీ యీలు సిక్కకుండా వట్టెయ్యాలి, తెల్సిందా? మరికానుకోండి, నే సీలెయ్యగానే మీదికురకండి, (దాగుదురు)

(రూపుసింగు ఆటవికవేసమున ప్రవేశము)

రూపు:- ఈప్రకృతిశోభ యెంతరామణీయకము. అత్యున్నతములై మేఘమండలిని చుంబించు పర్వతశ్రేణియు, తదాసువుల రమ్యమై విరాజిల్లు తరులతాగుల్మములును, తన్మధ్యప్రదేశములనుండి ప్రవహించు సెలయేటిధారలును, సమప్రదేశముల రత్నకంబళములవలె నలరారు పచ్చికబయళ్ళును, పచ్చికబయళ్ళలో విహా

రించు హారిణసమూహంబులును, పీనులకు విందుగొల్పు, విహంగ మృదుమధురగానంబును, పరమేశ్వరుని లీలావిని బుల వేనోళ్ళ చాటుచున్నవి. నిర్జనమై, నిస్సారమై, నిరంబ యోజనంబుల పర్యంతము వ్యాపించియుండు పారశీక ఎడారుల గాంచినపిమ్మట, నా కీదృశ్యమెంత రమ్యముగనుం అందుచేత నే, ఈపవిత్రభారతదేశమును బోలిన పుణ్యభ మరి యొండు ప్రపంచమున లేదందురు. తల్లీ !

సీ. గగనచుంబితములై గర్వోన్నతింజెందు
హిమశైల సౌందర్య మింపుమీర
పతితపావనమునై పరమపూజ్యంబునై
ప్రవహించు గంగా స్రవంతి వెలయ
ప్రాక్పశ్చిమంబుల ప్రాకారములబోలు
కనుమ లిర్వంకల గ్రాలుచుండ
వింధ్యమారావళుల్ వినువీధి పెనుదన్ని
గోపురద్వంద్వమై యొప్పుమీర
తే. సుందరారామసీమల శోభదనర,
శౌర్యధనులగు సాహసోదారయుతుల
పూతచరితకు నిలయమై యీపుణ్యభూమి
పరమపావని మాతల్లి భరతమాత.

తల్లీ! నీచరణసేవజేసి, తరింపనుద్యమించిన నాకు, విధి వైపరీత్య లెక్కలేని యాటంకము లుదయించెను. నాపూనిక వ్యర్థమై దలచు వగవను. అమాయికయు, భక్తశిఖామణియు, పూ త్రియువగు, ముక్తజీవితము భగ్నమైనందులకు వగచుచుం అయినను, సేవనంబునకు నా సర్వస్వము ధారవోయ సంసిద్ధుడ ఇప్పటికిని యీ నాకు స్వాస్థ్యము కుదుర లేదు, కపాలయా

ణము కనిపెట్టుకొని యున్నది. కందమూలాది వన్యఫలంబుల గాని వేగ మేగపలయును. ఓపరమేశ్వరా! దయాళూ! నీవే—

(భిల్లులు తటాలునదూకి, త్రాళ్ళతో కట్టివేయుదురు)

ఓరీ! ఎవరురా! దురాత్ములారా! ఇట్టిపనిజేసితిరి?

రాయః— మేమెరమో తర్వాతసెప్తాం. ముందుమాయేలికపాలికిరాండి.

రూపు:— ఎవరురా! మీయేలిక? ఆతడు నన్నుబంధించి తెమ్మని యాన తిచ్చెనా?

రాయః— మా యేలిక యీ భిల్లరాజ్యాని కంతకీ పెబువు. బలదేవ మారాజులు. మిమ్మట్టుకు రమ్మని ఆరు సెప్పనేదు.

రూపు:— అయిన నన్నేల బంధించిరి?

రాయః— ఈ కాన్లోకొచ్చిన, కొత్తమానిసి నేరైనాసరే పట్టుకొని రమ్మని ఆరి ముదల.

రూపు: నిరాయుధుడనైన నన్ను దొంగచాటున బంధించుట శూర ధర్మమా? నాచేతి కాయుధమిచ్చి నిర్జించికొని పొండు.

రాయః— ఓలయొయ్యా! మా కదంతా తెల్దు. మీరు మాసేత సిక్కారు. మా యేలికకాడికి రాకతప్పదు.

రూపు:— రాకున్న—?

జగః— రాకుంటే గంజికాయిడేసుకొని మోసుకపోతాం.

రూపు:— అయిన ప్రయత్నింపుడు (భిల్లులు ప్రయత్నింతురు. రూపు తన్ని పడగొట్టును)

జగః— ఓరోరె, యీడు సామాన్నపు మానిసికాదురోయి. యీణ్ణి తప్పక తీసుక పోవాల్సిందే.

రాయః— బాబయ్యా! మాతో పెనగులాడ్తే లాబమేంటంట. మా కా డాయుడా లున్నాయి. మీకునేవు. మీరుగాని మొరటతనం సేస్తే, మరిగంటే ఆటికిపని సెప్పాల్సొస్తాది. నా మాటినొక్కని,

ఎంత బలముంటే మాత్రమేంటంట. గోతిగాడ్ద యేను గేటి సేస్తాది. నా మాటినోకాని, మాతోగానోస్తారా సరే-లేకుంటే-యేటో సేయాల్నో సెప్తాది. మా యేలికోడి కొసై—అంతా సెప్పుకోవచ్చు, మరి అరిసయా, మీరాపాప్తం.

రూపు:- మీ యేలిక క్రొత్తమనుష్యుల నేలపట్టుకొని రమ్మనెను?

రాయ:- యోధపుర పెబువులూ అమరసింహులు వారి కాడ దాగొన్నారు.

జెగ:- ఏటిరా ఆ పేలాపన.

రాయ:- ఓరి నీ వుండారా! నాను మాటాడుతుంటేను. ఆయనగారి మంతిరి కూడుండాడు. మీరాయన కాడికి రాండి అంతా తెలుస్తది.

రూపు:- (తనలో) యోధపురసామ్రాట్టువారి మంత్రికూడా నుండిరా, వారి ప్రవాసవిషయ మీవరకె గోపాలవర్మ వలన వినియుంటిని. వారిని జేరుటయే మంచిది. (ప్రకాశముగ) ఇక్కడకు వారెంత దవ్వున గలరు?

రాయ:- మాకోన యిక్కడికొక్క కోసు దూరముంటది. ఆ రక్కడే వుంటారు రాండి.

రూపు:- నేను తలచినంత మాత్రముననే మీ వంటివారల నందరను మట్టుబెట్ట గలను కాని యోధపురాధీశుని కలిసికొన గోరుటచే మీతో రా నిచ్ఛగింతును.

రాయ:- ఒరేయి, యీయన పారిపోకుండ అంద రిన్నీ పేపులా కాపుండండి. మీకత్తులు బద్రంగా ఉంచుకోండి. మరి పదండి.

(నిష్క్రమింతురు)

## రంగము 3

స్థలము - అమరసింహుని శిబిరము.

[ ప్రవేశము: అమరసింహుడు, జనార్దనుడు, బలదేవు ]

— గురుదేవా! నిన్నటి యోధపురచారులు దెలిపిన విషయమేమి?

జనా:- వత్సా! సర్వమును మన కనుకూలముగనే యున్నది. కళ్యాణ దుర్గాధ్యక్షుడైన బలవంతసింహుని బలవన్మరణమును, అజితుని రాజ్యస్వీకరణమును మీరారు వినియే యుంటిరిగదా.

అమ:- భుక్తా అజితుల కలయిక మనకంత శ్రేయోదాయకము కాదేమో.

జన:- అజితు ప్రవృత్తియు, భుక్తా ప్రవృత్తికి భిన్నముకాదు. అందు చేతనే, అజితుని యాహ్వాన మంగీకరించి, భుక్తాకళ్యాణ దుర్గ గమనాసక్తుడై యున్నట్లు, విశ్వాసను పంపిన వార్తవలన వ్యక్త మగు చున్నది.

బ:- ఆర్యా! బలవంతుని మరణమునకు కారకులెవ్వరో తెలిసినదా?

జనా:- కళ్యాణదుర్గమునుండి వచ్చిన చారు లనేక విధముల జెప్పుచుం డిరి. రూపుసింగు బలవంతుని హత్యజేసెననియు, అజితు వానిని బట్టితే భటుల నంపెననియు, యొకటి. రెండవది, అజితసింహుడే హత్యగావించి రూపసింహునిపై నారోపించెనని. ఇందు రెండవ దానిని ప్రజలందరు సత్యమని భావింపు చుండిరట.

అమ:- అట్లైన రూపు పలాయను డగుటకు గతమేమి?

జనా:- వివరము లింకను దెలిసినగాని నిర్ణయింపలేము. కాని భుక్తా కళ్యాణ దుర్గమునకు వచ్చుట మనకు మిక్కిలి యనుకూలమని దలంచెదను.

బల:- కళ్యాణదుర్గము మాత్రము బలహీనమా? అది అత్యంత దుస్సాధ్య దుర్గములలో నొకటిగదా

అమ:- ఏమి, గురుదేవుల యభిప్రాయము? కళ్యాణదుర్గమును దాకవలె ననియా?

జన:- కళ్యాణదుర్గ మభేద్యమే————

అమ:- కర్తవ్యము?

జనా:- యోధపురమున తిరుగుబాటుకు వలయు సర్వసన్నాహములు
సంసిద్ధముగానున్నవి. కాని భుక్తా యనుచరు లప్రమత్తులై
చేయుచుండిరి. ఈ స్థితియందు, భుక్తా కళ్యాణదుర్గమువ
వచో వారిని సన్నిధినుండి నడిపించు వారుండరు. ఇక కళ
దుర్గమున, నన్ననో, అజితునియందు ప్రజల కాదరముంటే
బలవంతుని హత్యవలన ప్రజల కాతనిపై ద్వేషము హెచ్చి
ఇప్పట అజిత భుక్తాల యొక్కవ బలము సమకూర్చ
కావున భుక్తా కళ్యాణదుర్గమును చేరినవెంటనే దానిని ముట్టడి
ఆ సమయముననే యోధపురమున తిరుగుబాటు లేవదీయ
నిలని తలంచెదను. అట్లైన యోధపురమునుండి భుక్తాకు
యము చేరజాలదు.

అమ:- ఆహా! గురుదేవు లెంతటి యుక్తి జేసిరి! ఇది యెంతయు స
జనము.

బల:- గురుదేవులు చేసిన యోచన యుక్తి యుక్తముగ మన
వెంటనే మనము, బలము సమకూర్చి, సమర సన్నాహ
నుండవలయును. నూతన పరికరములు కూడ చేరినవి.
ప్రయోగమున మాత్రము శిక్షణ యొసంగవలయును.

జనా:- మీరప్పుడే తొందరపడకుడు. మన ప్రయత్నములో
యుండినచో సమయమును నేను దెలిపెద. మనసన్నాహము

భిల్లుడు:- (తొందరగ ప్రవేశించి) జయము, జయము, గురుదేవా!

జనా:- మన సన్నాహము జయమట—మంచిది. ఏమి వార్త!

భిల్లు:- మన రాయగండడు, జెగజెట్టి గడానాయకులు, ఒక ఆట
తీసుకొచ్చి, దేవర వారికి మనవిసేయ మున్నారుండి.

జనా:- ప్రవేశబెట్టుము. ఈపురుషు డెవరై యుండునో.

పాశము బంధింపబడిన రూపసితో భిల్లులు.)

ఎవఁడీవ్యక్తి? ఆటవిక వేషమున దివ్యజ్యోతివలె ప్రకా
శించెను. విశాలవక్షస్థలము, ఆజానుబాహులు, ఆకర్ణాంత
ము, సునిశితవీక్షణములు, శూరశిఖామణియని చెప్పు
(ప్రకాశముగ) భిల్లులారా! కట్లువిప్పుడు (అట్లుచేయు
రా!) ఏదేశము తమ వియోగమునకు గుందుచున్నదో,
ఏరముల కూర్పు తమ పవిత్రనామమై విరాజిల్లునో
చున్నా?

') ఏమి యీ మహామహుని సౌమ్యత! ఈయనయే
మంత్రులై యుందురు. వారే అమరసింహులు. ఈత
ప్రభువు. త్రిమూర్తులవలె విరాజిల్లుచున్నారు.

సందేహించెదవు? ఓరీ! భిల్లులారా! మీరావలకు బొందుం
డునగాని రావలదు.

ఈ నవీనుని యందెంతటి నమ్మకము? నా కులగోత్ర
రుఁగక మునుపే యింతటి నమ్మకమా జనార్దన మహా
లకు! యౌధపుర సామ్రాట్టును, వారి సచివుని, గురు
ఁ గన్న నా జన్మము ధన్యము.

మునితో) ఈయన మమ్మందఱ నెరిగియున్నాడే. ఎవరై
ను?

తో) మీరు సందేహింప నక్కఱలేదు. సుక్షత్రియవంశ
లగు అమరసింహమహారాజు లార్యధర్మమునకు విరుద్ధ
ప్రవర్తింపరు. శరణాగతుల రక్షించుట వారివిధి. మీ
ము చెందపుడు.

! కళ్యాణపుర నాసినగు రూపసినవాడను.

రూపసి వాడవా? శ్చంద్రుడవేనా?

జనా:- (వరించుచుండును)

రూపు:- నిర్భాగ్యుఁడ నగు రూపుసింహుఁడనే. భరింపరాని యపనిం
లక్ష లోనై నా నిర్దోషిత్వమును ధృవపరచుకొనినగాని వి
భారతమున తలయెత్తుకొని తిరుగ వెరచు రూపుసింహుఁడను—

జనా:- మీ స్వదేశాగమనమును గూర్చియు, బలవంతుని హత్యన
గూర్చియు, మే మిదివరకే చారులవలన వినియుంటిమి. మీ
రిప్పుడు ప్రయాణబడలికచేత నలసియుందురు. తొలుదొ
కొంచెము విశ్రమింపుడు. పిదప మీ చరిత్రను సవిస్తరము
చెప్ప వచ్చును.

రూపు:- ఆర్యా! ప్రయాణబడలిక యేమియు లేదు. నేనును, ఆకస్మి
విపత్తులచే చాంచల్య మతియైన, బలవంతుని యిల్లాలును
ఆమె సఖియు, యీవరకే యీ యరణ్యమున వాస మొనర్చు
కొంటిమి.

జనా:- ఆహా! ఎంతటిభాగ్యము. బలదేవా!

బల:- చిత్తముస్వామీ!

జనా:- వెంటనే వారినికూడ మన శిబిరమునకు జేర్చ యేర్పాటు
గావింపుము. సావధానులమై మిగతవిషయముల విచారింతము
ఆర్యా! మా యాతిథ్యమును స్వీకరించి, మమ్ముల ధన్యుల
జేయుడు. ఈ బలదేవుఁడు మిమ్మాదరించును.

రూపు:- గురుదేవులకు ప్రణామములు.

జనా:- ఇష్టఫలప్రాప్తిరస్తు. (బలదేవుడు దారిచూప రూపుని నిష్క్ర
మణము.)

అమా:- గురుదేవా! మీ చర్యలన్నియు దురూహ్యములు. రూపుసిం
హుడు నిందితుడో, హంతకుడో తెలియకుండగనే వానియం
దింతటి విశ్వాస మెంచుట తగునా?

జనా:- వత్సా! ఎంత బేలవు. మనకు చేరిన వార్తలబట్టి కళ్యాణపుర ప్రజలెల్లరును రూపుని నిర్దోషిగ నెంచు చుండిరనియు, ఆతని బంధించు ప్రయత్నములకు రోయుచుండి రనియు, రూపుసింహు నకు జేసిన ద్రోహమునకే అజితు నసహ్యించుకొను చుండి రనియు, వినలేదా? అదియునుంగాక, రూపుసింహుని యొక్క లక్షణముల గాంచినంత మాత్రమున, ఆతని నిర్మల వర్తనము స్ఫురింపలేదా? సాముద్రికశాస్త్రములో నూచించిన ధీరోదాత్త లక్షణము లన్నియు, యీతనియందు ప్రస్ఫుటమగు చుండుట లేదా?

అమ:- అట్లైన, రూపుసింహుని సన్నివేశపరచిన, యీ పరమేశ్వరుడు మన యందెంతటియో దయాళువు. రూపుసింహుని యద్భుత పరాక్రమమును, ధైర్యసాహసములును, కరలాఘవత్వమును, వ్యూహనిర్మాణ కౌశలమును జగద్విదితము లేగద.

జనా:- అందుచేతనే, ఆతని సహాయము మన కనన్యమైనది. ఆతనికిని మన సహాయమవసరము. ఎంతటి వీర్యవంతుడైనను, ఏకాకిగ నేమియు చేయలేడుగద. తన నిర్దోషిత్వమును నిరూపించుట కును, అజితునిపై పగతీర్చుకొనుటకును, మన సహాయమవసరము. ఈ యోధునిక పరికరముల ప్రయోగమునను,వ్యూహనిర్మాణాది తంత్రసాధన యందునను, ఆతడు మన సైనికులకు శిక్షణ నీయ గలడు. భర్తా, ఆజితుల గూర్చిన యీ పరమాత్మయే, అమర సింహునకే రూపసింహుని ప్రసాదించెను. ఆతని చర్య లెంత యాశ్చర్యజనకములో చూచితివా! మనముపోయి రూపు నాద రించి, కర్తవ్య మాలోచింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

అమ:- చిత్తము.

—౦—



# రాజ్యకాంక్ష

## పంచమాంకము.

### రంగము 1

స్థలము - కళ్యాణదుర్గమున అజితసింహాలయము.

[ప్రవేశము - అజితు - అలీఖాన్.]

అజి:- అలీ! సర్వమును సిద్ధముంగదా?

అలీ:- జీ సర్కార్. భుక్తాసింగ్ మహారాజావారికి క్షుద్రంసిద్ధం.

అజి:- వారిప్పుడే యిచటకు రాగలరు. వారికి తయారుచేయు పానీ
యుంచినావా, వారికిచ్చు మధురరసమునందును, నేను నీకిచ్చిన
ఏమి? ఎటు చూచెదవు?

అలీ:- ఇనుకుంటున్నాను. సెప్పండి సర్కార్.

అజి:- ఆపాత్రములోని మత్తుపదార్థమును కొంచెము కొంచెము క
చుండుము.

అలీ:- మీరు సెప్పింది అంతా మాకే సమజ్ అయింది సర్కార్.

అజి:- మాటికి వలయు సౌకర్యముల నన్నిటిని జాగ్రత్తగ చూ
చుంటివా?

లీ:- భుక్తాసింగ్ జీకీ-ఔరత్-మోతీబీబీ!-మాకీ చూచామ్ సర్కార్. అదిమంచి, మంచి మాటల్ సెప్తాది సర్కార్.

జి:- ఏమిమాటలు చెప్పినదేమి?

లీ:- మీరు వారీకి సాలామర్యాద్ సేసారు సెప్పింది. సర్కార్! అది బహుత్ ఖూబ్ సూరత్ హైం. అది మాంచి గా నేవాలీ, ఔర్, నాచీవాలీ సర్కార్. మీదిమాట సెప్తే అది మాంచి హుషార్ సేస్తాదీ సర్కార్.

అజి:- ఈసారి ఆమె నా ప్రసంగము దెచ్చెనా-యుక్తిగ బలికి. కథనడుపుము. ఆమె ఏమనెనో గ్రహించి నాకు దెల్పుము.

లీ:- అదిమీ రుమాకీ సెప్పవాలీ లేదు సర్కార్. మీదీ మాటాఅంటే మాదీ పానం యిస్తాం.

జి:- నీవు వెంటనే పోయి భుక్తాసింగు తయారుగనున్న నిచ్చట నిక్కి మించ దోడ్కొనిరమ్ము.

లీ:- పి.త్తం. పి.త్తం. (అని సలాముచేసి పోవును.)

అజి:- మోతి మిక్కిలి యందకత్తె. భుక్తా కేవలము విషయములోలుడు. కావున యామె చేతికీలుబొమ్మ. ఈ సందర్భమున మోతీని మోహనగింప గలిగితినా—కళ్యాణ దుర్గముతో బాటు, మోధ పురముకూడ నా హస్తగతమగును. అజితసింహా!నీవు ప్రయత్నించిన ఫలింపక పోవునా? అదిగో భుక్తాసింగు వచ్చుచున్నాడు. (ఎదురేగును.)

[అలీ హుక్కా-పట్టుకొని, దారి చూపుచుండును. వెనుక భుక్తా ప్రవేశము.]

అజి:- భుక్తాసింగు మహారాజా బహద్దరువారికి స్వాగతము. ఆ ఠయాసన మధిష్ఠింపుడు. ఈ పేద దుర్గాధ్యక్షుని యాతిథ్యమున లోపము లున్న, మన్నింప, మహారాజుల వారిని వేడుకొందును.

భుక్తా:- అజితసింహా! నీయాతిథ్యమునం దేలోపములును లేవు. మా యభిప్రాయమును ముందే యెరింగి, సర్వమును సమకూర్చి

చున్న నీధీశక్తి యత్యద్భుతము. నీయట్టి రాజభక్తిపరాయణుని, మాకు హితునిగ సమకూర్చుట మాయదృష్టము.

అజి:- దేవరవారు ఈయల్పుని పెద్దజేసి ప్రశంసించుచున్నారు. అది తమ విశాలహృదయమును, తమకు నాయందుగల వాత్సల్యతను దెల్పుచున్నది. శ్రీరామచంద్రునకు, ఉడుత చేసిన యుపకారము స్వల్పమైనను ఆ భక్తవరదుడు దానినామము శాశ్వతముగ నుండునట్లొనర్చెను.

భర్తా:- అజితసింహా! నాకు ముఖస్తుతి తెలియదు. చేయనవసరము కూడలేదు. కాని, నాసామంతులెల్లరును నీయట్టి భక్తివిశ్వాసములు కల్గియుందురేని, యీపాటికి జోధపుర సామ్రాజ్యము నెంత విస్తరింపజేసియుందును.

అజి:- ప్రభువువారు సత్యము వచించిరి. ఇప్పటికిని, విద్రోహియగు అసురసింహుని పక్షమున కుట్రలు పన్నప్రయత్నించువారు లేకపోలేదు. నారాష్ట్రమున నట్టివిద్రోహులకు తావులేకుండ జేసితిని.

భర్తా:- కావుననే నీబోంట్లుండిన చాలునంటిని. నీయాతిథ్యమున హృదయమత్యానంద భరితమైనది. అవును—మరచితిని—నీకు నృత్యగానముల యందాదరణ గలదా ?

అజి:- ఏదో, స్వల్పముగ నానందింపగలను.

భర్తా:- అట్లైన—ఇప్పుడే గావించెదము. మోతీకి నృత్యగానములయందసమాన ప్రజ్ఞగలది. అవి విజాతీయములైనను, అత్యంతాదరణీయములు ఆలీఖాన్ !

ఆలీ:- జీ ! సర్కార్. సలామాలేఖుం.

భర్తా:- ఈపాటికి మోతి సిద్ధముగనుండును. నీవుపోయి యామెను తోడ్కొనిరమ్ము.

ఆలీ:- చిత్తం. సర్కార్ (అని సలాము చేసిపోవును).

భుక్తా:- మోతి బాలికయయ్యు అసమాన ప్రజ్ఞావంతురాలు. నృత్య గానములయందేగాక, చిత్రలేఖనాది లలితకళలగూడ నారితేరినది. నాత్మగ్రాహి.

అజి:- అట్టి ప్రజ్ఞావంతురాలు గావుననే, రసజ్ఞులగు దేవరవారి మన్ననలకు పాత్రురాలైనది.

భుక్తా:- అదిగో వచ్చుచున్నది. (మోతి ప్రవేశము) మోతీ!

మోతి:- ఏలినవారికి సలాములు.

భుక్తా:- అజితసింగు మహారాజు దర్శనాదరము చూపియున్నారు. నీ నృత్యగాన విశేషముల నాతనియొద్ద నుగ్గడించితిని. కొంచెము వినోదము గావింపుము.

(ఆలీ భుక్తాకు హుక్కాయిచ్చును. మధురరసము తయారు చేయును మోతి పాడుచు నాట్యము సేయును. మధ్య మధ్య అజితుని సమీపించి అభినయించుచు కనుసన్న జేయును. అజితుసాదరముగ జూచుచు నాట్యములోనే భుక్తాకు మత్తుపదార్థమును కలిపిన మధురరసమిచ్చును. అతడు త్రాగుచు, హుక్కా పీల్చుచు మత్తిలుచుండును).

అజి:- ప్రభువువారు విశ్రమించినట్లున్నది. ఇక విరమింతమా ?

మోతి:- ప్రభువువారు, మీయాతిథ్యము నకలరి, మీయానందముకొరకే నాట్యమొనర్ప సెలవిడిరి గదా. కావున మీరే సెలవిండు.

అజి:- నీవతిచమత్కారిణివి కావున, నీభారము నాపై వైచితివి.

మోతి:- ఈభారమును వహింపలేరా?

అజి:- వహించుటకే యున్నది ? మరియొక పాటపాడి అభినయింపుము.

(మోతి పాడుచు అభినయించును)

అజీ:— సెహభాష్. నీప్రజ్ఞావిశేషము లనన్యము. నిశ్చయముగ నీ రంభాయూర్వసులు తీసికట్టు. కావుననే ప్రభువువారి మన్న లకు పాత్రురాలవైతివి.

మోతి:— ప్రభువువారిమన్ననలకేమి? కళారసజ్ఞులును, రసికవీరులును, గ్రహి పజాలని దేమున్నది ?

అజీ:— ప్రథమసమావేశముగదా ! నీవు లలితకళ నారితేరితివట ?

మోతి:— కళారాధకులు తరచినగద, శక్తిసామర్థ్యములు బయటపడు

అజీ:— సెహభాష్! నీవు ప్రియభాషిణివి కూడనా ?

మోతి:— ప్రియులకుగద, ప్రియభాషిత్వ మర్థమగుట.

అజీ:— తిరిగి నీప్రియవచనామృతపాన మెప్పటికో ?

మోతి:— పిపాసకులకు కాలనిర్ణయమా ? ఐనను సాయంకాలము—ఆ బాపురు. తెలిపెదను.

అజీ:— మంచిది. అలీ ! ప్రభువువారు గాఢనిద్రయందున్నవారు. విచ్చుటనే కనిపెట్టుకొని యుండుము.

(మోతితో నిష్క్రమించును)

అలీ:— హద్దదీ! సర్కార్‌కీ, ఔరత్‌కీ, బలేజోడీ.

(తెరపడును)

రంగము 2.

స్థలము – కళ్యాణదుర్గమార్గమున అమరసింహుని శిబిరము.

ప్రవేశము – జనార్దనుడు, అమరసింహుడు, రూపుసింహుడు.

:— రూపుసింహా! కళ్యాణపురదుర్గపు ముట్టడికి సర్వమును సిద్ధ గదా ? ఇక మనము దుర్గ మెన్నిదినములలో చేగలము ?

రూపు:- ఇప్పటి వేగముననే ప్రయాణమొనర్చిన, నింక మూడుదినము లలో చేరగలము. కళ్యాణదుర్గముయొక్క ఆనుపానులు, నాకు పూర్తిగ దెలియును. దానినవలీలగా పట్టుకొనుటకు, రహస్య మార్గమున్నది.

అమ:- ఆ దుర్గమున శిక్షితులగు సైనికులెందరుందురో ?

రూపు:- ఐదువేల కంటె హెచ్చు లేరు.

జనా:- మనబలమిప్పటికి పదిహేను వేలుకదా బలదేవా! ఇందాశ్వికు లెంతమంది ?

బల:- ఆశ్వికులు, వేయిమందిమాత్రము. మిగతయంతయు కాల్బలమే. ఆధునిక రణశిక్షితు లందు అయిదు వేలు మాత్రము. మిగిలిన వా రాటవికులైనను బాహాబాహి పెనగుటలో నెట్టివీరులకైనను దీసిపోరు.

జనా:- రూపుసింహా! మనము భేదోపాయమునుగూడ నుపయోగింపవలె ననుకొందును.

రూపు:- దుర్గము ముట్టడించుటకు ముందు, అమరసింహులు, రూప సింహ బలదేవసహాయులై దుర్గము నాక్రమింతురనియు, అజితుని శాసన మంగీకరింపని వారిని దుర్గమును వీడివచ్చిన, నాదరింతు రనియూ, జయము తప్పదనియు, చాటించిన, దుర్గములోని, అత్యంతసంఖ్యాకులు అజితుని పరిత్యజింతురనుట నిశ్చయము.

అమ:- మేలు. రూపసింహా! మేలు. నీయట్టి ప్రజ్ఞావంతుని, నాకు మిత్రునిగా నొసంగిన యీపరమేశ్వరుడు వందనీయుడు.

జనా:- ఇక సైన్యవిభాగమునుగూర్చి యోచింపవలసియున్నది.

రూపు:- కళ్యాణదుర్గమునుజేరు యోధపురమార్గమున, మన అమరసింహ మహారాజులు, 500ల యాశ్వికులతోడను, రెండు వేల కాల్బల ముతోడను కాచికొని యుండవలెను. ఇది యోధపురము

నుండి సహాయ్యము చేరకుండుటకును, కళ్యాణ దుర్గమునుండి యోధపురము వారలు చేరకుండుటకును, అవసరము.

జనా:- ఔను. అత్యవసరమే. తక్కిన సైన్యము ?

రూపు:- తక్కిన సైన్యము, దుర్గమును ముట్టడింపవలెను. అందు దక్షిణ మున బలదేవు డెదుర్కొనవలెను. ఆ వైపునుండియే దుర్గమును వీడిపోవుటకు రహస్యమార్గమున్నది. మిగత ప్రాంతముల నేను సమర్ధించెదను.

అమ:- మిగత 500ల యాత్రికులు యేమిచేయవలెను?

రూపు:- ఈ యైదువందల యాత్రికులును, మనకొండొరులకు వార్తలనం జేయుటకును, సమరవ్యూహము సక్రమముగ నడుపుటకును తోడ్పడవలెను.

జనా:- బలదేవా! నీవు సైనికుల హెచ్చరించి పురికొల్పుము. తెల్లవారఝామున రెండు ఘడియల ప్రొద్దుండగా తరలవలెను. తెలిసినదా

బల:- చిత్తము గురుదేవా.

జనా:- విశ్వావసునకు, మన పంపిన వర్తమాన మీపాటికే చేరియుండును యోధపురమున, భుక్తానుచరులును, ఉద్యోగస్తులును, వె టనే బంధింపబడుదురు. అమరసింహ పక్షపాతులందరికి, ఆయ ధము లీపాటికే చేరియుండును. ఎచ్చటివారి నచ్చట తెల్లవార మునుపే బంధింపగలరు. విశ్వావసువు అమరసింహుని పక్షము రాజ్యస్వీకరణ మొనర్చును.

బల:- ఇచ్చట కళ్యాణదుర్గముకూడ వశమైనచో జయలక్ష్మి మన వరించును.

రూప:- అజితు మిక్కిలి చతురుడు. భుక్తావలె క్రూరుడయ్యు, విమ లోలుడుగాడు. తనకార్యనిర్వాహణము వారికే యితరుల న మోహించుట కొఱకును గాక, వారిని పూర్తిగ విశ్వసింపడు. శ

కార్యసాధనానంతరము వారిని విడనాడుటకు కూడ జంకడు. ఆతని విషయమున కడు జాగరూకతతో మెలంగవలయును. ఆతనికి వ్యవధి నీకుండగనే పై బడవలెను. లేకున్న మన మిత్ర వర్గమునకూడ తంత్రముల బన్న సమర్థుడు.

జనా:- అమరసింహా! ఈసైన్యమున కంతకును రూపుసింహుని సేనాధి పతిగ నభిషేకింపుము. బలదేవా! ఏమందువు ?

బల:- నాకు సర్వసమ్మతము. ఈ వీరశిఖామణి శాసనము మాకవశ్య కర్తవ్యము. ఈమహాయోధుని సరసను, శత్రుసంహారణ కర్మకు గడంగుటకంటె మాకు ధన్యతరమైన కార్యమొండు లేదు.

అమ:- రూపుసింహమహాశయా! ఈగురుదేవుని ఆజ్ఞానుసారము, యీ బలదేవుని యామోదమున, యీ సర్వసేనకును నిన్ను నాయ కునిగా నియమించితిమి.

ఓయోధపురవీరులారా! ఓ భిల్ల సైనికులారా! మనము కోల్పో యిన స్వాతంత్ర్యమును, రాజ్యలక్ష్మిని, తిరిగి పొందుటకు, శత్రుసంహారము తప్పని సరియైనది. అహింసయే పరమధర్మమని మన యార్యధర్మములు ఘోషించుచున్నను, వర్ణాశ్రమధర్మ ములు క్షత్రియులకు ధర్మసంస్థాపనార్థము, సంగ్రామమున శత్రు మారణకర్మను విధించినవి. జగదేకగురుండు యీ ధర్మమునే భారతయోధుడగు విజయునకు కురుక్షేత్రమున నుపదేశిం చెను. కావున, ఈవిజయోత్సాహుని రూపుసింహు ననుసరించి, మీ ప్రాణములనైన నొడ్డి, వీరజనయోచితంబుగ సమరంబున శత్రుల నిర్జించి, పోయిన స్వాతంత్రమును, పోయిన రాజ్యమును, తిరిగి ప్రతిష్ఠింపుడు, సమర సన్నాహులుగండు. జై! భవానీ దేవికి జై! బలదేవా! "భవాని" యను యీ కరవాలమిటు దెమ్ము. (అందుకొని) రూప్‌సింహా! (కరవాల మొసంగి) సర్వ సేనానివై సమరంబుల నిర్జించి, విజయలక్ష్మిని వరింపుము.

రూపు:- మహాప్రసాదము. (ప్రణమిల్లును) ఓ యోధులారా! మహా నాయకులారా! వీరరసపుత్ర వంశమున నుద్భవించిన పరమ పావనులారా! భారతవీరుల ప్రతాపము జగద్విదితము. అందు రసపుత్రవీరుల వీరవిహారముల శత్రుజన హృదయ భేదనము. వీరోచితముగ వర్తించి, మీ ప్రభువుల మర్యాదను గాపాడవలసిన భారము మీపైనున్నది. ప్రాణము లస్థిరంబులు, యే మహామారియో, లేక యే యితర వ్యాధియో జనించి కుళ్ళి చచ్చుటకంటె, వీరకర్మ మాచరించి, ధర్మసంస్థాపనార్థము, స్వధర్మ నిర్వహణమునకు, మీ దేశదాస్య విమోచనకొరకు, మీ యసువుల బాసినచో మీ నామములు, స్వర్ణాక్షరముల చరిత్రలో లిఖింపబడి, మీరు, రాగలకాలమువారికి మార్గ దర్శకు లయ్యెదరు. భగ్గా అజితులవంటి ద్రోహుల, కుతంత్ర పరాయణుల శిక్షించుటలో దప్పేమియు లేదు. మీరు విజయ కాంక్షులు గండు. జై! భవానీదేవికి జై! (తెరలో జయఘోష)

జస:- మేలు, రూప్‌సింహా! మేలు. నేను యోధపురమును వీడునపుడు అమరసింహుని రాజ్యమున ప్రతిష్టించినగాని పురము ప్రవేశింప నని భవానీదేవి పాదములకడ ప్రమాణమొనర్చితిని. కాన నా దేవి నారాధింతము.

(అందరు భవానినిగూర్చి పాడుదురు. తెరపడును.)

## రంగము 3.

స్థలము - కళ్యాణదుర్గమున లీలోద్యానము.

[ప్రవేశము—అజితు—మోతి.]

మోతి:- నా జనకుడు పారశీక దేశపు సర్దారు. నన్ను సర్వవిద్యాపారంగతు రాలిగ జేసెను. కాని విధివశమున, నొక పారశీకవర్తకుడు

నన్ను దొంగిలి తెచ్చి, యీ భుక్తాసింగున కైదువేల దీనారములకమ్మెను. నాటినుండియు నే నీతని బానిసనై విలాసవస్తువుగ నుంటిని.

:— మోతీ! దైవమెంత నిర్దయుడు! శిరము నలంకరించవలసిన గులాబిపూవును కాలఁ ద్రాయుటయా! నీయట్టి సర్వాంగసుందరిని, సర్వకళాశోభితను, లావణ్యవతిని, యీమోటు మానిసికి, యీ ముదుసలికి, భుక్తాకంట గట్టెను. దైవమింత మతిమాలిన పను లేల జేయునో. నీవేల వాని దిరస్కరింపవైతివి?

—తి:— దేశముకాని దేశము, భాషవిజాతీయము, సాంఘిక కట్టుబాట్లు విజాతీయములు, సన్నిహితులు లేరు. కట్టతుదకొక కన్నీటిబిందువైనను కార్చువారు లేరు. పులినోటి మాంసఖండము నైతిని.

:— నీచరిత్ర విన్న కొలందిని, నాహృదయము కంపమొందుచున్నది. నీయట్టి దీనురాలి నుద్ధరింపని జన్మమేల? ఈ కఠినాత్మునితో నీవెట్లు వేగుచుంటివో తెలియకున్నది.

—తి:— ఉమార్ ఖయ్యాం—సిద్ధాంతములే నా కాచరణీయములు. పాన పాత్ర—విలాసగోష్ఠి—నాదుఃఖమయ జీవితమున, తేన్ప్రణాళి గొల్పి, నాదురవస్థను మరచుట కవియే దోడ్పడుచున్నవి. ఈ హేయప్రపంచమున, నుల్లాసముగ జీవయాత్ర గడుపుటకు మరి యొకమార్గము గానరాదు. కాలకూటాపంతరము అమృతమును, ముండ్లపొదలో గులాబీని, బొగ్గుగనినుండి వజ్రమును వాన చినుకునుండి ఆణిముత్యమును, సృష్టించిన యా సర్వేశను నా దుఃఖమయ జీవితమున నాశాజ్యోతి వెలిగింపలేడా కండ్లనీరు క్రమ్ముచున్నను, మందహాసము చిరుపెదవుల నిండవింప

అజి:- మోతి! నీవు కళోపాసకురాలవు మాత్రమే గాదు, సాహిత్య
సరస్వతివి, వేదాంత వేదినివి. నీయట్టి యాపురూపవతి దీ..ద
తొలగింపలేని జన్మము నిశ్చయముగ, వ్యర్థము—వ్యర్థము.

మోతి:- మీకు త్రికరణశుద్ధిగ, అట్టి సంకల్పమున్నదా?

అజి:- ఉన్నదో, లేదో, నేను వచింపనేల? ఇదిగో యీ బాకుతో నీకో
నా హృదయమును చీల్చి యందెట్టి తరంగములు చెలరేగ
చున్నవో పరీక్షింపుము. ఊఁ—వెనుదీయకుము.

మోతి:- అంతటి సాహసకార్యమా?

అజి:- నీవువరింపని జీవిత మీ విధముగ నంతమైనను సంతోషమే
ఇపుడే యసువులగోల్పోయినచో, నీ సుందరవిగ్రహము నా
మనసున చిరస్థాయిగ నిలచియుండును. ఆ పదనారవిందముని
వీక్షింపుచు, పరలోకములో నుండినను సుఖదాయకమే. ఆ
సింపక నాజన్మమును సార్థకపరచి నాపాలి ముక్తి కా
లెవుగమ్మా.

మోతి:- మీకంతటి గాఢానురాగమే నాపైనున్న ముందు నన్ను వ
నోటినుండి తప్పింపుము. పిమ్మట తారాచంద్రులవలె పవిత్ర
పథమున నడయాడుదము.

అజి:- నిశ్చయముగ నీకట్టి సంకల్పమే యున్న, నీవే సాధింపగలవు.
నీతోడ్పాటు లేనిదే, నిన్ను బంధవిముక్తనుగ జేయుట నా
కసాధ్యము.

మోతి:- నేనెట్లు తోడ్పడగలను? నాకర్థమగుట లేదు.

అజి:- అర్థమగునట్లు జెప్పమని యెదవా? నీవు దానిని తప్పక యాచ
రింతువని ప్రమాణము నర్పెదవా?

మోతి:- నాబంధవిముక్తి కేతువన్న—యాచరింపకుందునా? ఆ తారా
చంద్రుని సాక్షిగ—ముమ్మాటికిని యాచరింతును.

అజి:- అట్లైన, దగ్గరగరమ్ము. మనరహస్యము మనలో నిమిడియుండ వలెను. మనహృదయములు రెండును నేకమైనవికదా. ఇక తనువులుమాత్ర మేకముకావలసి యున్నవి. పిమ్మట నేనే నీవు, నీవే నేను. నాసుఖదుఃఖములు నీవి, నాభాగ్యోన్నతి నీది, నా భావిజయంతయు నీయధీనమున నున్నది. దానిని క్రమముగనిర్వహించిన, ఫలితము నీవే యనుభవింతువు.

మోతి:- ఇంతవరకు, నేను జేయవలసిన దేమో దెల్పలేదు.

అజి:- వినుము. సావధానవై వినుము. భర్త క్రూరుడు. అత్యాశాపిశాచి, ఏపని చేయుటకైనను, జంకడు. కాని సోమరి. విలాసప్రియుడు. కావుననే నీయందంతటి మోహము. నీవిలాసముల దేలుచున్న రాజ్యతంత్రముల గూడ మరచిపోవును. అతనిప్రాణములు నీ యధీనమున నున్నవి.

మోతి:- అతని ప్రాణములా! ఏమి సంకల్పించుచుంటివి ?

అజి:- నీబంధవిముక్తి. నీజీవితసౌఖ్యము. నీయానందగోష్ఠి.

మోతి:- అందుల కంతటి దుష్కార్యమా. ఆమాట నానోట నుచ్చరింపలేను. నా కాంతునియం దెంతటి యసహ్యతయున్నను, ఎంతటి నీచభావమున్నను, అంతటి కర్కశహృదయను కాజాలను. అజిత్, నన్ను క్షమింపుము. నే నీ దీనావస్థలోనే కృంగికృశించెదను.

అజి:- స్త్రీకి యిది సహజమే. ఈ హృదయదౌర్బల్యము. సహజకోమలమైన స్త్రీ కర్కశ కాజాలదు. కాని కార్యసాధనకు, కాక తప్పదు. భర్త జీవించియుండ, నీవును-నేనును దేశాంతరగతులమైనను, ఖండఖండాంతరముల కేగినను, సురక్షితముగ నుందుమనియా నీయభిప్రాయము. ఎచ్చటికేగినను, బట్టితెచ్చి కొరత వేయింపగలడు. ఒకవిపత్తును దాటి, మరియొక విపత్తును దెచ్చిపెట్టు

గొందువా ? ఆలోచింపుము. కాకున్నను సర్వమును విడచి, దేశాంతరగతులమై యేమనుభవింపగలము; యోచింపుము. మోతీ! నిరాశనొందకుము. నేను చెప్పిన యుక్తి యుభయ తారకము.

మోతి:- నీవు నాహృదయమున తుపాను లేవదీసితివి. నేను కర్తవ్యతా విమూఢుడనై, సంక్షోభమునకు లోనైతిని.

అజి:- నీసంశయముల నివారించుటకు నేను చక్కనిమార్గ ముపదేశించుచుంటిని. భుక్తా యీలోకమున నున్న మనల సుఖముగ జీవింపనీదు. భుక్తా యీప్రపంచమును వీడిన, కళ్యాణదుర్గముతోబాటు జోధపురముకూడ మనదే. మోతీ-జోధపురచక్రవర్తిని ఆడినదాట, పాడినపాట. అజితు ఆమె చరణ సేవకుడు. ఆమె శాసనమును మన్నించి, యామె యశఃకాంతుల దశదిశల వ్యాపింపజేయును. ఆలోచింపుము-ఊఁ-పారశీక సర్దారునిపుత్రి. నిర్భాగ్యవశమున బానిసయై, దుష్టుడైన భుక్తా పాలబడి, నలిగి,నలిగి, తుదకు విధివశమున చక్రవర్తినియై శాసించుటయెంతటి యపూర్వసంఘటనమో యోచింపుము.రానున్న విభవమును కాలదన్నెదువా ? శాశ్వతముగ భూలోక నరకమున ననుభవింతువా? కోరుకొమ్ము. నీయదృష్టము నీయరచేతనున్నది. ఈయజితు నిమిత్తమాత్రుడు.ఊఁ-శీఘ్రముగ దెల్పుము.

మోతి:- అజితసింహా! నీవు నన్ను నిశ్చయముగ నిర్జించితివి. ఈలోకములో నిట్టి యాతన నిక ననుభవింపజాలను. ఈనవయౌవనము నన్ను వీడకమునుపే నాయదృష్టమును పరీక్షించెదను. నన్నేమి సేయుమందువు ?

అజి:- నీ కేమియు జేయ నక్కరలేదు. భుక్తాసింగు నిన్ను త్వరలో జె[illegible]దును. సహజముగ పాడుము. అతనిలాలించి మైమరచి[illegible]

యున్నపుడు (రహస్యముగ) నే నాలిచే నొకపొట్లమును పంపె దను. దానిని మధురరసములో కలిపి యాతని కొసంగుము. ఏమట్లు చూచుచుంటివి? వెంటనే మరణింపడులే. అది కొన్ని దినములకుగాని పనిచేయదులే.

మోతి:- సరే.

అజి:- ఏదీ! నా యీ యుపాయమున కొక బహుమానము.

మోతి:- విజయానంతరము. అంతలోనే తొందరేల ?

ఆలీ:- (ప్రవేశించి) సర్కార్. భుక్తాసింగ్ మహారాజాబహద్దర్ ఆర హాహై.

మోతి:- ఆలీ ! హుక్కా తయారుచేయుము. మధురరసమును సిద్ధ పరుచుము.

అజి:- ఆలీ ! (చెవిలో నేమో చెప్పును).

ఆలీ:- (మోతి కొకపొట్లమును నిచ్చును. ఆమె భద్రపరచును).

(భుక్తాసింగు ప్రవేశము)

మోతి:- (ఎదురేగి) ప్రభువువారింత యాలస్యము చేసితిరేల ?

భుక్తా:- ఇంతవరకును నిద్రపోవుచుంటిని. ఆదేలనో ఈదుర్గము చేరిన ప్పటినుండియు మాకు నిద్రహెచ్చినది.

అజి:- ఇచ్చటి వాతావరణ మతిశీతలము. అయ్యది మీకానందదా యకముగ నుండనోపును.

భుక్తా:- ఇచ్చట సర్వమును మాకానందదాయకములే. ఈలీలోద్యా నము నింత సుందరముగ నొంచిన, నీసౌందర్యపిపాస నెంతయైన కొనియాడదగును. (ఆసన మలంకరించును. ఆలీ హుక్కా యిచ్చును).

అజి:- ప్రభువు వారికి నాయందుగల యాదరముచేతనే నాయొక్క ప్రతికార్యమును, వారి కానందదాయక మగుచున్నది.

భుక్తా:- మోతీ! మొన్నటి నీ నృత్యగానముల గూర్చి, అజిత సింహులు మిక్కిలి ప్రశంసించెను. ఈ సంధ్యాసమయమున నొకపరి నాట్య మొనర్పుము.

మోతి:- ప్రభువువారి బానిసను. వారియానందమే నా విధి. (నాట్యము చేయుచు భుక్తాకు మధురరస మొసగును).

భుక్తా:- ఆహా ! ఏమినాట్యము ! మోతి ! నీ నాట్యము ఆనాటికా నా డతిశయించు చున్నదిసుమా. స్వర్గమున యప్సరసలుకూడ, నీవద్ద కొన్ని భంగిమలు, నేర్చుకొనవలసియుండును.

అజి:- ప్రభూ! ఈ నాట్య మపూర్వము. నే నెన్నడును చూచియుండ లేదు.

భుక్తా:- ఈ మోతి నన్ను ధన్యుని చేయుచున్నది. ఈరాజకీయ వాసనల వదుమ, నాకు తన్మయత్వమును గల్పించి స్వర్గసౌఖ్య మొసంగుచున్నది. ఇచ్చటికి వచ్చినప్పటి నుండియు రాజకీయముల బొత్తిగ మరచిపోతిని. తడవయినది. రేపే యోధపుర ప్రయాణము.

అజి:- ప్రభువువా రింతలోనే తిరిగిపోదురా ? కొలది దినంబులాగి యీభృత్యుని చరితార్థుని చేయప్రార్థన.

భుక్తా:- యోధపుర వార్త లేమియురాలేదు. ఈ విప్లవ దినములలో ప్రధాన నగరమును వీడి చిరకాలముండరాదు.

అజి:- తమ సర్వసేనాని వీరసింహుడు,మంత్రి విశ్వావసువును సర్వము నిర్వహింప సమర్థులు.

భుక్తా:- నిశ్చయమే. కాని, పోకతప్పదు. అలీ! (హుక్కాయిచ్చును) మోతీ! (మధురరసమిచ్చును).

అజి:- ప్రభువువారు ప్రయాణసన్నాహు లగుచున్నారు. కానిండు. సర్వమును సిద్ధమొనర్పమందురా ?

భర్తా:- మంచిది. మోతి ఈ రసమింత మాధుర్యముగ నున్న దేమి? ఏదీ! మరికొంచెము. (ఇచ్చును).

(భర్తకు మగతగ్రమ్ముచుండును)

మోతి:- (అజితునిచూచి చిరునవ్వు నవ్వును).

(రాజభటుడొకడు పరువున ప్రవేశించును)

భటు:- సర్దార్. దుర్గగోపురమునుండి చూచిన రాజభటులు, దూరమునుండి యేదియో సైన్యమువచ్చుచున్నజాడ గనిరట. ప్రభువు వారికి విన్నవింపమనిరి.

అజి:- సైన్యమా! ఎంతదూరముననున్నది?

భటు:- కనుచూపు మేరలోనున్నదట. ధూళి రేగుచున్నదట.

అజి:- నీవు పోయి గోపాలవర్మతో సత్వరము సైన్యముల నాయత్తము నర్చి, రణసంసిద్ధులగమ్మని దెల్పుము. పొమ్ము. (భటుడు పోవును) మోతి, ప్రభువు నిద్రాగతుడయ్యెనా?

మోతి:- అట్లే తోచుచున్నది. పెద్దనిద్ర కాదుగద.

అజి:- నీవాతని గనిపెట్టియుండుము. ఆలీ!

ఆలీ:- జీ! సర్దార్.

అజి:- నీవీ మోతికి తోడుగ నుండుము. ప్రభువువారిని లోనికి గొనిపోయి విశ్రమింపజేయుడు. మోతి నే నీ సందడియేమో చూచివచ్చెదను.

భటు:- (ప్రవేశించి) దక్షిణమునుండి ఆకస్మికముగ మరియొకదండు మన దుర్గమును దాకినది. దేవరవారికి దెలుపమని యాజ్ఞ.

అజి:- ఆ సైన్య మెవరిదై యుండునో?

భటు:- వారాటవికులవలె నుండిరట. బందూకులకూడ ప్రయోగించుచుండిరట.

అజి:- గోపాలవర్మ సైన్యమును సిద్ధపరచెనా లేదా ? వెంటనే పోయి సర్వమాయత్త పరచమని దెల్పుము.

(భటుడుపోవును) (తెరలో ఢాం అని పేలుడుశబ్దము)

భటు:- (ప్రవేశము) జయము. జయము. మహారాజా.

అజి:-ఏమివార్త?

భటు:- నేలయీనినట్లు శత్రువులు దుర్గము నలుప్రక్కలను మూగు చున్నారు. మొదటి ఫిరంగిని దుర్గముపై ప్రయోగించిరి.

అజి:- గోపాలవర్మ లేడా?

భటు:- వారెచ్చటను గాన్పించుట లేదు.

అజి:- కనిపించుటలేదా ? ఏమైనాడురా ?

భటు:- గోపాలవర్మయును, మరియేనూరు యోధులును కొంత కాల్బలముతో కోటవీడి చనిరని పుకారు.

అజి:- కోటవెలపలనే శత్రువుల దాడి సంకల్పించి యుండును. అత డతి చతురమతి.

భటు:- దేవా!... ... ..... ...

అజి:- ఏమిరా సందేహించెదవు ? సత్వరము దెల్పుము.

భటు:- గోపాలవర్మ-స్వసైన్యముగ-శత్రుల జేరెనని చెప్పుకొనుచున్నారు.

అజి:- శత్రులెవరు ?

భటు:- రూపుసింహ, అమరసింహులట.

అజి:- ఎంతమోసము ! ఓరీ ! రాజద్రోహి ! ఇందులకు ఫల మనుభవించెదవులే. మోతి! ప్రభువును లోనికిజేర్పుము. నేను విజయుడనై తిరిగి కలుసుకొందును. (వడిగా భటునితో పోవును).

మోతి:- ఎంతలో ఎంత యనర్ధము వాటిల్లినది ! అలీ ! ప్రభువును మందిరమున జేర్తము రమ్ము.

( తెరపడును )

## రంగము 4.

స్థలము - కళ్యాణదుర్గసమీప యుద్ధభూమి.

ప్రవేశము - రూపుసింహుడు, అమరసింహుడు, జనార్దనవర్మ, గోపాలవర్మ.

అమ:- గోపాలవర్మా! నీకు స్వాగతము. ధర్మరక్షణార్థమై మే మొనరించు యీ సంగ్రామమునను, ధర్మపక్షపాతివగు నీవు ససైన్యముగ మమ్ము జేరుట ప్రశంసనీయము.

రూపు:- యోధాగ్రేసరుండును, అనుభవశాలియు, పెక్కుయుద్ధముల నొక్కవోని వీరత్వమును జూపి, యుక్కుమీరియున్న యీ వృద్ధయోధుని రణచాలసత్వము మన పక్షమునకు జయము కూర్పకమానదు. కురువృద్ధుం బోలిన యీగురువృద్ధు నెంత ప్రస్తుతించినను తనివితీరకున్నది.

జనా:- అమరసింహా! ఈమహాయోధుని సహాయసేనానిగ నొసర్పుము. కళ్యాణదుర్గపు, ఆనుపాను లీమహామహునకు దెలిసినట్లొరులకు దెలియవు.

గోపా:- మీరు నాయందుంచిన విశ్వాసమునకు నేనెంతయు కృతజ్ఞుడను. అజితు భుక్తాసింగు లొనర్చిన అత్యాచారమునకు ప్రతీకార మొనర్పుటయే యీ భృత్యుని పరమలక్ష్యము. రూపుసింహ ముక్తాబాయిలకు గల్గించిన యపకృతికి, నాతోనున్న యోధులు తీవ్రకోపానలమున ప్రతి యొనర్ప వేచియుండిరి. ఇక నాలశ్యము చేయక శత్రుసంహారమునకు గడంగుడు.

అమ:- (కైజారునిచ్చి) సహాయసేనానిగా నొనర్చితిని, విజయకాంక్షులరై విరాజిల్లుడు.

రూపు:- మహాశయా! మీరు ససైన్యముగ దుర్గము తూర్పు దెసను దాకుడు. అవసరమునుబట్టి మీ రోసంగు నలహాను తలదాల్చె

దను. విజయసిద్ధి నొందుదురుగాక. ప్రభూ! తమరును తక్కిన యోధులును మునునిర్ణయించిన స్థానములఁ జేరుకొనుడు.

(గోపాలవర్మ, అమరసింహుడు, నిష్క్రమణము)

జనా:- రూపుసింహా! సైన్యముల పురికొల్పి తలపడుము. నేనీ సాలిమా వ్యూహమునుండి, సర్వమును దిలకింతును. (పోవును)

రూపు:- ఓ! సేనానులారా! యోధులారా!

ఉ॥ అచ్చెరువందు విక్రమము నగ్గలికన్ సమరంబులోన వే
వచ్చెడి శత్రుసైన్యముల వచ్చి విహారముసల్పి, యోర్చి, వి
వచ్చను బోలి ఘోరసమరావని శౌర్యముజూపి యొప్పియే
పొచ్చెములేని బల్మిగల బోలిచరింపుడు దుర్నిరీక్షులై.

శా॥ ధీరోదారులు, ధైర్యసాహస మహాధీశక్తి దుర్వారులై
క్రూరాచారుల, ధూర్త శత్రుగణ దుష్కూటంబు చెండాడి వే
వీరాలాపములం జెలంగి జగతిన్ విఖ్యాత విస్తారులై
వీరాగ్రేసరులార! శౌర్యధనులై వే పొందుఁ డ్స్వేచ్ఛార్థమై.

క్రూరాచారులైన దుష్టరిపుల చేతిక్రింది కూడు గుడిచి మనియుండుటకంటె, శత్రుసంహార మొనర్చుట వీరోచిత ధర్మము. ఈధర్మనిర్వాహణమున నసువులబాసినవారికి వీరస్వర్గము విధినిర్ణీతము. కాలుఁడెప్పుడును గాలము వైచుకొని కాచియున్నవాడు. మరణ మెప్పటికైనను దప్పనిదే. స్వధర్మరక్షణార్థము మరణించుట ధీరలక్షణము. మీ పుణ్యభూమిని మరువకుడు. కర్మయోగులను వీరాధివీరులను గని తనయశశ్చంద్రికల దశదిశల నింపిన వీరమాత యీ భరతమాత. ఆమె చరణసేవకై యాత్మార్పణ మొసర్ప వెనుదీయకుడు.

సీ॥ దండిమగలనై న చెండి గొండాడెడి
రసపుత్రవీరుల వసజెలంగ,

దుస్సాధ్య వనసీమ దుర్గవిచ్ఛేదన
దక్షులై భిల్లులు దారిజూప,
వ్యూహాది నిర్మాణ వాహ్యాళిచతురులౌ,
దండిమరాటీల పిండుగూడ,
అతిభీకరంబులౌ కరియూథములనైన
నరికట్టు మావలీలురికిపోర,
శత్రుమారణ భీషణ తంత్రమందు
దేవదానవవీరు లుత్తేజు లగుచు
నిక్కువెరగొందు రీతిని యుక్కుమీరి
చెక్కుచెదరక జయులక్ష్మి జేకొనుందు.
( నిష్క్రమించును )

జనా:- (ప్రవేశించి) మేలు రూపసింహా! మేలు. నీయుద్బోధ యెట్టి భీరువునైనను ధీరుని చేయగలదు. నీయట్టి పుత్రరత్నముల నింకను గనినచో భారతమాత దాస్యశృంఖలములువీడియుండదా?

(గోపాలవర్మ, అజితసింహులు పెనంగుచు ప్రవేశము)

అజి:- ఓరీ! దుర్జాతీ! దుష్టాత్మా! రాజద్రోహీ! యెందుబోయెద వురా! ముచ్చువలె ససైన్యముగ శత్రుశరణాగతుండవైన భీరువా? నీద్రోహమునకు ప్రతిక్రియ యొనర్చెదనుగాచికొమ్ము.

గోపా:- ఓరీ! నరరూపరాక్షసా! నీవునాకు ధర్మముపదేశింప బూనితివా. ముఖవ్యాఘ్రమువలె, నెయ్యంబు నటియించి సోదరునకు ద్రోహమొనర్చిన మహాపాతకివి. పితృహంతకుడవు. అర్ధరాత్రమునమాత్రుసమానను,పవిత్రచరిత్రను,చూలాలిని,ముక్తాబాయిని శారదవుల పాలుచేసిన రాకాసివి.హృదయమున్నదా? ఉన్న, నది పాషాణనిర్మితమై యుండవలెను. నీ పాపము పండినది. నేటితో ముక్తినందగలవు కాచికొమ్ము.

అజి:- ముదిమిచే మతిపోయి కారులరవకుము. కాచికొమ్ము.

(పోరుచు లోనికేగుదురు. భటులు పోరాడుచు నటు నిటుపోదురు)

జనా:- (ప్రవేశించి) ముసలివాడవైనను గోపాలవర్మా! ఎంతటి కర లాఘవమున పోరసితివి!

భటు:- (ప్రవేశించి) జయము జయము మహామంత్రులవారికి.

జనా:- ఏమి వార్తలు ?

భటు:- దక్షిణమున బలదేవరాజు సైనికులు కోటకెగబ్రాకి లోన ప్రవేశించి ద్వారమును తెరచిరి. బలదేవులు ససైన్యముగ కోటప్రవేశించుచుంటినని దేవరవారికి మనవిజేయుమనెను.

జనా:- భళీ! బలదేవా! నీ స్వామి భక్తిపరాయణత మెచ్చదగినది. నీవు త్వరగపోయి యీవార్త రూపుసింహ, అమరసింహుల కందజేయుము. (భటుడుపోవును) సమరము భీషణరూపము దాల్చినది. శత్రుసైన్యములు దుర్గరక్షణముపై నాసవిడచి, కలియబడి బాహాబాహి పెనంగుచున్నవి.

భటు:- (ప్రవేశించి) జయము జయము మహామంత్రులవారికి. దుర్గము చాలవరకు మనవశమైనది. ఇదియంతయు గోపాలవర్మ ద్రోహముచే సంభవించెనని, క్రోధమూర్తియై అజితుడాతనితో భీకరముగ పోరుచున్నాడు.

జనా:- రూపుసింహ, అమరసింహులెచ్చటనున్నారు ?

భటు:- యోధపురమునుండి కొలది యోధులు భర్తా సహాయార్థమై వచ్చుచుండ, అమరసింహుడు వారిని దాకి మట్టుబెట్టెను. ఇక రూపుసింహుడు సమరభూమిని వీరవిహారముచేయుచు, ఎచ్చట జూచినను తానయై వెలయుచుండెను. గోపాలవర్మ సహాయార్థమై వారిరువురును తమ సైన్యముల మరలించిరి. ఇపుడు సంగ్రామమత్యంత ఘోరముగ పరిణమించెను.